# గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువులు భూమిలో పోషక పదార్థములను చేర్చటం మాత్రమే కాదు, వివిధ పైరులకు కావలసిన సంపూర్ణ పోషణ నిస్తాయి. అదే గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువుల ప్రత్యేకత!







## చాలా రకాల ఎరువులు వాడితే

నత్రజని మురుగు నీటి ద్వారాను, వాయు రూపంలోను వృధా అయిపోతుంది. భాస్వరామ్లం రసాయనిక మార్పుచెంది పైరుకు అనుకూలంగా అందదు.

## గ్రోమోర్ వాడి తేడా చూడండి

అమోనియా రూపంలో అందే నత్రజని భూమిలో నిలిచి పైరు పెరిగినంత కాలం వృధా చెందక లభిస్తుంది. భాస్వరామ్లం నీటిలో కరిగి పైరుకు చాలా అనుకూలంగా అందుతుంది.

## గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువులు మీ డబ్బుకు మహత్తర మైన విలువను అంద జేస్తాయి!

చేనుకు చేవ,
రైతుకు రొక్కం —
గ్రోమోర్

coromandel
gromor

కోరమాండల్
ఫెర్టిలైజర్స్
లిమిటెడ్

మీకు కావలసిన గ్రోమోర్ ఎరువులు మీకు దగ్గరలోనున్న ప్యారీ వారి ఎరువుల డిస్ట్రిబ్యూటర్ల వద్ద కొనండి.

AIYARS-CF.370-TL

# మీ పట్టణమును శోభాయమానముగా చేయుటకు ఒక క్రొత్త పద్ధతి!






పూల డిజైనులు, వివిధ మనోహరమైన రంగులు, సొగసైన అద్దకముల దుస్తులను ధరించి వనలక్ష్మిలా పట్టణమును చుట్టిరండి. బోంబే డైయింగ్‌లో కళ్లు మిఱిగే కాటన్ పాప్లిన్సు, కాటన్ సాటిన్సు, కేంబ్రిక్, రుబియా మరియు 'టెరీన్'/కాటన్ రకములు మరియు స్ట్రాబెరీ పింక్, లైట్ బ్లూ, డార్క్ గ్రే, నేవీబ్లూ, మరూన్ మరియు రస్ట్ ఆరు సరి కొత్త రంగుల డెనిమ్సు లభిస్తున్నాయి.

## బోంబే డైయింగ్

మావలె మరెవ్వరూ ఆడపిల్ల అభీష్టమును గ్రహింపజాలరు.

# ఉత్తరాలు

కొన్ని అనివార్య కారణాల వల్ల ఈ వారం 'ఒక వారం విపరీతం' వెయ్యలేక పోతున్నాము—సం.

## ముఖచిత్రం

నటీమణుల ముఖచిత్రాలు తగ్గించి నటుల ముఖచిత్రాలు వెయ్యాలని కోరుచున్నాను

—పెంటకోట పోమునాయుడు (యలమంచిలి)

## కథలు

20—10—72 ఆంధ్ర పత్రికాముఖమ్మైన ఉత్తరాల శీర్షికనూ, అందరి హైదరాబాదునుండి రాసిన మూర్తిగారి వెన్ను ప్రసాద్, లక్ష్మి కుమార్‌గార్ల ఉత్తరం చదివాక ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. 'పతివ్రత' కథలో ముగింపు అర్థంగాకపోవడాని కేముంది? డబ్బు, బంగారం కనకం ఇంట్లో, సౌందర్య దాటుపోలేదు. 'సౌందర్య' శ్రేయోభిలాషిగా పవి మనిషి కనకమే ముందు చూపుతో డబ్బు, బంగారం తన ఇంట్లో దాచి వానిని స్వార్థపరులైన 'సౌందర్య' బావగారి బారినుండి కాపాడింది. కావున రచయిత పతివ్రత అని వ్యంగ్యంగా రాయలేదు. సౌందర్య నిజంగా పతివ్రతే! గా. పాఠకులు ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తారనుకుంటాను.

కో. నెం. రమణ, బి. నా. మూర్తి (కొత్తఢిల్లీ)

* * *

27—10—72 తేదీ పత్రికలోగల ఒకేఒక ప్రత్యేక కథ చొప్పకల్ని చంద్రమవులిగారి 'కౌగిలి' సంస్కారం, ఈ సంచికకే మకుటం వంటిది. ఈ మధ్యన ఇంత బిగువైన కథాశిల్పంగల కథలు అరుదు. కథలో మూర్తి చెప్పినట్టుగా 'కరుణ' శరత్‌స్త్రీలా గంభీరమైన వ్యక్తిత్వంగల స్త్రీలా స్ఫురించింది. మొదట కరుణ తీసుకొన్న చొరవ చూస్తే కథ అలా ముగుస్తుందని అనుకోలేం. మూర్తి నిర్ణోషమైనా ఆ చొరవకు లొంగిపోక తప్పలేదు. అతని స్థానంలో మరేపురుషుడున్నా అంతే. ముందు వెనకలకు లాగే మనస్సుల సంఘర్షణ వలనవే కథకు బిగువు ఏర్పడింది.

ఆర్. ఎస్. రమాదేవి, (కరీంనగర్)

## సీరియల్

20.10.72 పత్రికలో శ్రీ బండారు పాండు రంగేశ్వరరావు, కర్ర సతీష్‌గార్లు 'విద్యార్థి లక్కగారికి డెలివరీ కాకముందే మగపిల్లవాడని ఊహించుకోవటం తప్పు' అన్నారు.

కాని సహజంగా పుట్టబోయేది మగపిల్లవాడవాలనే అందరూ (చాలామంది) కోరుకొంటూ వుంటారు. అలానే ఊహిస్తూ మాటల ద్వారా వ్యక్తం చేస్తూ వుంటారు. ఐదుగు తొలిసారి కన్నక చాలా

# లక్ష్మి యిష్టములను గురించిన తాజా వార్త

తను నటించిన పిక్చర్ ప్రారంభపు రాత్రి తారలా వెలుగుతున్న లక్ష్మిని మీ యిష్టములు ఏమిటని అడిగితే, ఆమె నవ్వుతూ యిచ్చిన జవాబులు :

'సితార్ : దాని మధురమైన ధ్వనికి నేను పరవశించిపోతాను. సువాసన : తేలికైన అత్తరు వాసనకు నేను ఫిదా అయిపోతాను. ఆదివారములు : వారం అంతలో నాకు యిష్టమైన రోజు. నెలలో అన్నీ ఆదివారాలైతే ఎంత బాగుండును అనుకొంటాను!'

మీ సౌందర్య రహస్యము అని అడిగితే లక్ష్మి చిఱునవ్వు చిందిస్తూ అన్నారు. 'లక్స్ ఎల్లప్పుడూ'




'నా సౌందర్య రక్షణకు నేను వేరే ఏ సబ్బునూ నమ్మను. శుద్ధమైన, సౌమ్యమైన లక్స్ నేను ఏరి కోరి వాడే సబ్బు

మంది అలాగే కోరుకుంటూ వుంటారు. లోక సహజ కోరికను అలా వ్యక్తీకరించటంలో అసహజత్వం ఏమీ లేదు.

మల్టిపుల్ లెవెల్స్‌లో, మల్టిపుల్ మీనింగ్స్‌తో మెదడుకు పని కల్పించేలా కొనసాగుతున్న ఈ సిరీస్ బాగుంటున్నది. —ఎ. విఠల్‌రావు. (తెనాలి)

## వ్యాసాలు

ఈ మధ్య ముల్కీ నిబంధనలపై సుప్రీంకోర్టు వారి తీర్పు, దానిపై ముఖ్యమంత్రి వ్యాఖ్యానము వినే ఉంటారు. తెలంగాణావారికి ఆంధ్రలో ఉద్యోగాలు, వారి పిల్లలకు చదువులు ఆంధ్రులతో సమానముగా లభిస్తున్నాయి కాని ఆంధ్రు(ధు)లకు మాత్రము తెలంగాణాలో ఉద్యోగాలు కాని వారి పిల్లలకు చదువులు కాని లభించవు తమ రాష్ట్రంలో, తమ రాజధానిలో తమకే ఉద్యోగాలు లేని దుస్థితి భారతదేశంలో ఆంధ్రులకు మాత్రమే పట్టినది. మాకు ఉద్యోగాలులేని, మా పిల్లలకు చదువులు లేని మాకు ఏ మాత్రం నీడలేని, ప్రయోజనం లేని ఆ రాజధాని మాకెందుకు? ఈ విషయంపై ఆంధ్రమంత్రులు మౌనవ్రతము పట్టుట ఎంతైనా శోచనీయము బలవంతుడిదే రాజ్యమా? మీరు ఏ మాత్రం పక్షపాతములేని వారయితే ఈ ఉత్తరం ప్రచురింపగలరు

వి. రామమోహన్‌రెడ్డి, (పొన్నూరు)

* * *

వి. ఎస్. చక్రవర్తిగారూ మీరు 27.10.72 పత్రికలో 'భారత్ ఒలింపిక్స్‌లో పోదిలో కూడ లేకుండా పోయింది. కనీసం కాంస్య పతకం కూడ గెల్చుకోలేకపోయిం'దన్నారు. భారత్ ఎప్పుడూ పతకాన్ని సంపాదించేది ఒక్క హాకీ ఆటలోనే. ఈసారి కూడ ఒక కాంశ్య పతకాన్ని గెల్చుకొని తమ పరువు కొంతవరకు నిలబెట్టుకో గలిగింది. మీరు ఈ ఉత్తరం వ్రాసేముందు ఒక్కసారి మెడల్సులిస్టు చూసి ఉండవలసింది. పి. వి. కృష్ణప్రసాద్, (బాపట్ల)

# ఉత్తరాలు

ఈ వారం టి. ప్రసాదు గారి 'ఆలోచించవలసిన విషయం మడిమ' అనే వ్యాసం చదిని ఈ లెటర్ వ్రాస్తున్నాను

ఆ వ్యాసం దురుద్దేశ పూర్వకంగా కక్షలయి వ్రాసినట్లు స్పష్టం అవుతుంది.

ఎంతో విలువగల మీ పత్రికలో ఈటువ్వ వ్యాసంను ప్రకటించి నందుకు చాలా విచారిస్తున్నాను. ఇక నుండి ఏలాంటి ఆంధ్ర—తెలంగాణా రాజకీయాలలో మీా పత్రిక తల దూర్చ వద్దని నామనవి.

ముఖ్యంగా హైకోర్టు ముల్కీని కొట్టివేసినపుడు ముఖ్యమంత్రిగారు కాబినెటు మంత్రుల ఆమోదంతోనే సుప్రీం కోర్టుకు అపీలు చేసినారు. ఆ టైములో ఆంధ్ర మంత్రుల మనుష్యుల హైకోర్టు 'ముల్కీని' కొట్టివేసినది. ఇక సుప్రీం కోర్టు కూడా ముల్కీని కొట్టివేస్తె పెద్ద విరగడ అవుతుంది అని ఆలోచించారు.

దేశంలో అత్యున్నత న్యాయస్థానం తీర్పును అమలు చేయుటం, ముల్కీ అనె మా న్యాయమైన హక్కును మేము కోరుకోటంలో తప్పులేదు.

నిర్బంధ సమయిక్యల బదులు రెండు రాష్ట్రాలుగా విడిపోవుట మంచిది అనినా ఉద్దేశ్యం.

—ఎస్. రమేష్, (కామారెడ్డి)

(64వ పేజీ చూడండి)

## మనవి

ఉత్తరాలు రాసేవారు తమ పేరు, పూర్తి చిరునామాతోనహా, తెలుగు లిపి మాత్రమే వాడాలి.

—సం॥



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు

**(1938–1972)**

శుక్రవారం : 17–11–72

(శ్రీపరీధావినామ సం॥ కార్తీక మాసం॥ శుద్ధ ఏకాదశి)

*సంపుటము : 66 సంచిక : 10*

స్థాపితం : 1908

సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

*ఆంధ్రపత్రిక కార్యాలయము*

*7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1*

**విడి ప్రతి వెల 50 పైసలు**

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి రేఖ.

( ఫోటో : శ్రీ 'ఉత్తర' )

# తలక్రిందులైన పూజ్యభావం













# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

**శ్వాసను మించిన గ్యాసు**

అబ్బ! జంటనగరాల ప్రజలు అక్టోబర్ పూర్వార్ధంలో గ్యాసుకోసం పడిన బాధ వర్ణనాతీతం గ్యాసు తేరురాయినా!' ఒక అన్నపూర్ణమ్మగారు ఆవేదనపడితే, "వీళ్ళకు ఏమి పోయేకాలం వచ్చింది! వంట చెరకులూ లేక, పింగరేణి సింగారాలూ లేక గ్యాసు సరిగా సరఫరా అవుతుందికదా అనుకుంటే, దానికీ లోపమేనా!'అని మరొక అలివేలమ్మ లంగలార్చు.

నాగరకత పెరిగి, పరివ్యాప్తమైనకొద్దీ పరిమితకాలంలో పనిచేసుకొని తక్కిన సమయం సద్వినియోగం చేసుకొందామనే మనస్తత్వం సంఘ చరిత్ర పరిణామం. నేడు దిగువ మధ్యతరగతి ఇళ్ళల్లోకూడా, గ్యాసుతో వంటచేసుకోవటం ఆరంభించింది, ప్రబంధ కవులు వర్ణించిన కరపమాలాలలో, పాద పద్మాలలో ఆసంబరంగా దర్శనమిస్తుంటారు. వాళ్ళను మరీ రాకాసిబొగ్గు యుగానికి, సమిధయుగానికీ వెళ్ళమంటే ఎలా? ఆ మధ్య వచ్చిన కిరసనాయిలు పంపుస్టౌలు, పెట్రొలుస్టౌలయుగం పద్మగంధులను గ్యాసు మూనెగంధులుగాను, కిటుంబు నాసికలను కిరోసిన్‌నాసికలుగాను చేసిన సంగతి తలుచుకుంటేనే నా ఒళ్ళు కంపిరమెత్తుతుంది. గృహనిర్వహణలో, పాకశాస్త్రంలో గ్యాసు శ్వాసవంటి వస్తువయింది. దాని సరఫరా సరిగా జరుగనప్పుడు గృహవ్యవస్థ అస్తవ్యస్తం కావడం సహజం. కనుక ప్రభుత్వం ఈ విషయంలో ప్రశ్న తెమలించే బాగుంటుందని జంటనగరాలలో ప్రతిగ్యాస్ పాక యాజిని అనుకోవడం వినిపిస్తూంది.

**పాలబుడ్లలో పురుగులు**

ముద్రవేసిన మందుసీసాలలోనే పురుగులు కనిపించాయని ఫిర్యాదులు వినబడుతున్న మనదేశంలో పాలసీసాలలో పురుగులు ప్రత్యక్షమయ్యాయనడం ఒక లెక్కా? ఆమధ్య ఒక సంపాదకుడు సంభాషణలో ప్రసంగవశాత్తు ఒక పెద్దకంపెనీ 'చేతితో తాకబడకుండా చేయబడిన 'బిస్కత్తుల ప్యాకెట్లలో బతికిన బొద్దింక పిల్లలు కనిపించినవన్నప్పుడు, 'అది ఎలా సాధ్యమండీ?' అన్నాను. 'బొద్దింకగుడ్లు ప్యాకింగ్ కాయితాలకు అంటుకొని వుంటాయి. ప్యాకింగు తర్వాత, అక్కడే పెరిగి పెద్దవయి వుంటాయి' అన్నారు ఆయన. ఆయన విజ్ఞానశాస్త్రపట్టభద్రుడు గనుక నేను నమ్మాను, ఇంత కథ వున్నప్పుడు, సికిందరాబాద్‌లో కొన్ని పాలబూతులలో పాలసీసాలలో పురుగులు కనిపించాయని గ్రాహకులు బూతులు తిట్టడం ఏమి సబబు అంటాను.

**యువభారతి ఋస్తున్న నవభారతి**

'చుట్టూతా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది.' అన్న వాక్యంతో 1963లో ఊపిరిపోసుకుని అప్పటినుంచి కృషి చేస్తున్న అముద సాహితీసంస్థ యువభారతి. ఇంతవరకు ఇది రచన, కావ్యలహరి, చైతన్యలహరి, మహతి, అనే వివిధ వ్యాస కదంబాలను ప్రచురించింది. ఇటీవల (అక్టోబర్ 15న) ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో 'ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్' అనే విజ్ఞాన సర్వస్వం వంటి గ్రంథాన్ని శ్రీ గోరాశాస్త్రితో ఆవిష్కరింప జేసింది. రాజకీయ, సాహిత్య, ఆర్థిక విభాగాలనే త్రివేణిగా వెలసిన ఈ గ్రంథంలో దేశంలోని ప్రముఖుల వ్యాసాలున్నాయి సభకు అధ్యక్షత వహించిన ఆర్థిక కార్యదర్శి డాక్టర్ ఎన్. రమేశన్ అన్నట్టు ఈ గ్రంథం స్వాతంత్ర్యానంతర ఆంధ్రదేశ సౌభాగ్యాన్ని విహంగమ దృష్టితో వరికించి ప్రజలకు విజ్ఞానం విరజిమ్మింది. ఈ గ్రంథం సంపాదకులు ప్రొఫెసర్ పి. వి. రాజగోపాల్ సభ్యులు డాక్టర్ సి. జె. లాల్, పి. వి. ఎస్. సూర్యనారాయణ.

**సరసతకు చిహ్నం**

తినడం. తాగడం కులాచారం, ఇవ్వడం పుచ్చుకోడం లెక్కాచారం' అన్నది పాత సామెత, సంఘకార్యక్రమాలలో హోదాలు, సంపదలు పాటించకపోవడం అనే సత్సంప్రదాయం జంటనగరాలలో ఉన్నంతగా నాకు చాలాచోట్ల కనిపించలేదు. ఏ వివాహం జరిగినా, ఏ ఉత్సవం జరిగినా అన్నివర్గాలు, అన్నివృత్తుల పెద్దలు పాల్గొని, సౌహార్దం ప్రకటిస్తారు. దీనికి తార్కాణగా ఇటీవల సామాన్యుడైన బడిపంతులు శ్రీ కర్ణమడకల రాఘవాచార్యులుగారు జరిపిన తన ద్వితీయపుత్రిక చి. సౌ. సుచేత వివాహమే తార్కాణం. వరుడు సుప్రసిద్ధ న్యాయవాది అయిన పెనుగొండ వేదాంతాచార్యుల పౌత్రుడు, శ్రీ డి వి, శ్రీనివాసాచారి పుత్రుడు శ్రీ శ్యామ్. పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, ఎం. ఎల్. సి. శ్రీ వి. వి. రాఘవాచార్యులు, శ్రీ కొత్తూరు సీతయ్య మొదలయినవారు విచ్చేశారు. పెద్ద వివాహ మంటపాలలో ఒక్కటయినా విశా హోద్ గౌభుజా నమాజీ కల్యాణమంటపం కిటకిటలాడింది

**ముల్కీ, గైర్ముల్కీ.**

అదేమి దురదృష్టమో కాని 'ఆంధ్రప్రదేశ్ ఇక ఫరవాలేదు. ముందుకు పోతుంది' అని అనుకున్నామో ఏదో వచ్చిపడుతుంది అనాహూతం. ఇప్పుడీ ముల్కీ సమస్య పక్కలో మురికిలాగ తేలింది మరీ. నిజానికి ముల్కీ ఏమిటో అర్థంకాదు. దాని పుట్టుపూర్వాలేమిటో ప్రతివారికీ తెలుసు. బుద్ధుడడిగాడట కశ్యపుడనే బ్రాహ్మణున్ని, నీపూర్వులు ఎవరయ్యా అని, రెండుతరాలు వెనక్కు వెళ్ళాడో లేదో, క్షత్రియరక్తం కలిసిందన్నాడట. ముల్కీ సమస్య అంతే మూడు తరాల ముందుకుపోతే దాదాపు చాలమంది

గ్రైర్ముక్కులే. కాని వారు ఏవర్వైనా, ఒక ప్రాంతంవారికి అన్యాయం జరిగినప్పుడు, దానిని నివారించడానికి యత్నించడం, విశ్వాసం కలిగించడం, ఇతరుల విధి. అయితే ఒక ఉద్యోగి నాతో అన్నారుగదా—'నాలుగు కోట్ల మందికి సర్కారు నౌకరీలే వున్నాయా? ప్రభుత్వోద్యోగాలకింత ప్రాధాన్యం ఇచ్చి. ప్రభుత్వం ప్రజను పెడదారిని పెడుతున్నది. ఉద్యోగావకాశాలు విస్తారం చేయండి. అప్పుడు చూడండి. ఈ సమస్య ఉంటుందేమో!—' అని ఇదే నిజమనిపిస్తుంది. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజి కార్యాలయం ముందు సినిమాహాలు ముందు కన్నా ఎక్కువమంది జనం మూగివుండడం కనిపిస్తున్నప్పుడు, చదువు వృత్తికి దోహదం, ఏ వృత్తికయినా చదువు మెరుగు పెడుతుంది అనే భావం వేళ్ళు తన్నునప్పుడు గతి ఇంతే. అఖిల భారతీయ విద్యార్థి పరిషద్ అక్టోబర్ 22 న్యూ ఎం. ఎల్. ఏ. క్వార్టర్స్ హాలులో జరిపిన 'నిరుద్యోగ సమస్యా గోష్ఠి' లో ప్రకటితమయిన భావాలు ప్రపుండగలవేమో చూడాలి.

**ఆహార్య సిద్ధుడు**

నేను డాక్టర్ చంద్రశేఖరంగారిని 1945 నుంచి చూస్తున్నాను. ఆయన ఏటా తన వృత్తిలో పెరుగుతూనే ఉన్నాడు. ఆయన వాక్చాతుర్యం, వేషధారణ. ఆహార్య విజ్ఞానం వేయిరేకులుగా విస్తరిస్తూనే వుంది. అక్టోబర్ 22, 23 తేదీలలో కళాభవన్‌లో నటరాజ సాంస్కృతిక కళాసమితి ఏర్పాటుచేసిన డాక్టర్ చంద్రశేఖరం వివిధ ఆహార్యాల చిత్రాల (మేకప్ ఫోటోల) ప్రదర్శనం జంటనగరాల సహృదయులకు కన్నుల పండువయింది. విద్యామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఈ మేకప్ ఫోటోల ఎగ్జిబిషన్‌కు ప్రారంభోత్సవంచేసి. 'వేషానందం' పేరుతో ప్రచురించిన ఆహార్య ఛాయా చిత్రాల సంపుటిని ఆవిష్కరించారు. 68 సంవత్సరాల చంద్రశేఖరంగారు, మనోవాక్కాయ పాటవం కించిత్తయినా చెదరక సేవచేస్తున్న చంద్రశేఖరంగారు శతమానమూ, ఈవిధంగానే వెనకటి తరాలవారిని, ఇప్పటి తరాలవారిని ప్రత్యక్షం చేస్తూ తాము ఆనందిస్తూ, ఇతరులనూ ఆనందింపజేయాలని ఆశిస్తున్నాను.

**ఉపశ్రుతి**

'ఏమవ్వా, మడి అంటావు? ఏగిరేగితే పడుతావు? అంట్లంటావు! కర్రలపై నీళ్ళు పోస్తావు? గ్యాసు సిలెండరు ఏకం కాదూ? మడి ఏమయింది?' అని సవినయంగా అడిగాను ఒక వృద్ధ సీమంతినిని. 'నాయనా? గ్యాసంటే ఏమిటి? అగ్ని భగవానుడు, నిప్పు సదా చెదలంటునా?' అన్నది. ●

# అనామధేయుడి ఆత్మకథ

## సీరియస్లెస్ హాస్యరచన — ఆర్వీయ

## 16

మా మండలివారు ఆ 'ముక్తావళి'ని మూడువేల సైక్లోస్టయిలు కాపీలుతీసి, మూడువందల వూళ్ళలోనున్న ప్రముఖులందరికీ బట్వాడా చేశారు. అవేమైనాయో వాటి అతీగతీ తెలీదు. నాకు పేరూ లేదు. మా క్లబ్బుకి వూరూ పేరూకూడా లేదు.

పోనీ లెండి, మీరైనా చూస్తే...

కం. స్వాగతము మీకు స్వామీ!
స్వాగతము మహానుభావ! స్వాగత
మయ్యా!
స్వాగతము మీకు బాబూ!
స్వాగతములు మీకు లండి! స్వాగతము
లివే!

తే. గీ. అలఘు పార్టీలవెన్నియో కలవు దేశ
మందు టిపార్టి డిన్నరులంచునెన్నొ
కాని మీ పార్టికున్నంత ఘనయశంబు
వాఁకెరికి గలదే యివ్వసుధయందు?

కం. లేచిన వేళ యదెట్టిదో
పాదిమొగముతోడ ఎవరి బరికించి
తిమో
మా చేసిన యఘమెట్టిదొ
చూచితిమీ దినము నిన్నశుద్ధ
చరిత్రా!

తే.గి. జయము! జయమయ్య! జయమయ్య!
జయము! జయము
విజయమయ్య! విజయమయ్య! విజయ
మయ్య!
దిగ్విజయము! దిగ్విజయము! దిగ్విజ
యము!
మంగళము! మంగళము! సర్వమంగ
ళంబు!



ఈ విధంగా ఏ సందర్భం వచ్చినా—పద్య పంచరత్నాలో, పద్య నవరత్నమాలో, పద్య నక్షత్రగుచ్ఛమో, లేకుండా చుట్టుపక్కల ఏ కార్యక్రమమూ ముగిసేదిగాదు. ఈలోపుగా 'సాహిత్య కండూతి' పత్రికలో కొన్ని కావ్య కళాఖండ శకలాలు ప్రచురింపబడ్డాయి — అంటే రాయబడ్డాయి. అవన్నీ చిన్న సంపుటంలో ఆంధ్రదేశానికి అందజేసి నేనూ ఒక గ్రంధకర్తని కావాలన్న సంకల్పం ఉదయించి ప్రాణాటికీ బలీయం కాసాగింది. కీర్తి కండూతి అలాంటిది మరి! ఈ ఉద్దేశ్యాన్ని ఆచరణలో పెట్టడానికి అనంతకోటి వుపాయాలు ఆలోచిస్తూ—దానికి తగిన మార్గాలు అన్వేషిస్తూ సతమతం అవుతూ వుండగా—

'కళాకండూతి మండలి' అధ్యక్షులవారికి అరవైయేళ్ళు నిండేయి. ఆ సందర్భంతో తనమీద రాయబోయే అభినందన పద్యాలు వినాలని మరీ మరీ మురిసిపోయేడు. పద్యాలు పకడ్బందీగా రాయాలని నన్ను స్పెషల్‌గా హెచ్చరించేడు. ఇదే సమయం!— అని నా మనస్సుని మథనపెడుతూన్న సమస్యని అతనిముందు వెళ్ళగక్కేను. 'సాహిత్య కండూతి' గ్రాంతపత్రికలో ప్రకటింపబడిన పద్యాలు అచ్చు వేయిస్తే నేను అభినందన పద్యాలు రాస్తాను. లేకపోతే లేదు!— అని ఖండితంగా చెప్పేశాను.

రెండురోజులు వారు ఏకబిగిని ఆలోచించి, చివరకు 'వూఁ' అన్నారు. ఇలాగ బేరం పెట్టడం ఎంతవరకూ సమంజసం?— అన్న ప్రశ్న దయచేసి వేయకండి.

డాక్టర్, మీరు చెప్పింది నిజం-
ఇప్పుడు కుటుంబమంతా
ఎంతో ఆరోగ్యంగా ఉన్నది.

"అవును, జానకి. నాకు తెలిసిన మంచి ఆరోగ్యవంతమైన కుటుంబాలన్నీ 'హార్లిక్స్' తాగుతాయి—అది పుష్టిని చేకూర్చు టానికి ప్రధాన సాధనం

అంటారు జానకియొక్క డాక్టరు గారు





'హార్లిక్స్' రిజిస్టరు కావింపబడిన ట్రేడ్ మార్కు.

'హార్లిక్స్' యొక్క విశిష్టమైన ఆహార విలువ ఆయనకు తెలుసు. 'హార్లిక్స్'లో మంచి సత్తువనియ్యగల మాంసకృత్తులు, శుద్ధమైన పూర్తి మీగడగల పాల పుష్టినిచ్చే సారము, గోధుమ, మాల్టు చేయబడిన బార్లీ వంటి ప్రకృతి సిద్ధమైన పదార్థములు ఇమిడి ఉండుట కారణముగా అది సర్వ శ్రేష్టమైనది. ఉదాహరణకు. 'హార్లిక్స్' పాల యొక్క పుష్టి నిచ్చే శక్తిని రెండింతలు పెంచుతుంది.

జానకి తన కుటుంబములోని వారందరికీ ప్రతి రోజూ 'హార్లిక్స్' ఇస్తుంది. దాని ప్రయోజనం కనిపిస్తూనే ఉంటుంది. వారు ఎంతో ఆరోగ్యవంతంగా, శక్తివంతంగా ఉంటారు. అది 'హార్లిక్స్' పుష్టి నుంచి వచ్చినది. కుటుంబము యొక్క పుష్టికి సంబంధించి నంతవరకు ఎవరికీ 'హార్లిక్స్'ను మించి మరొకటి తెలియదు.

## 'హార్లిక్స్'-మంచి పుష్టికరమైనది

## అనామధేయుండి ...

పారిజాతములందు, వైనాయికములందు
ప్రౌఢ, విశ్వ, గ్రంథ రచనలందు—
ఏదయినా సవ్యమే'

కర్త కండూతి అలాంటిది కదండీ, మరి!!

ఆ షష్టిపూర్తి మహోత్సవ సందర్భంలో రచించిన అభినందన పత్రికను స్థలాభావంచేత ఇక్కడ పొందుపరచలేకపోతున్నాను. అందుకు పాఠకులు నన్ను దయతో క్షమించ ప్రార్థితులు.

ఇక్కడ మీకు ఒక చిన్న అణుమాత్రం— లేక—లవలేశ సందేహం కలగవచ్చు. మండలి అధ్యక్షులు ఎక్స్-అఫీషియోగదా. అంటే ఆఫీసు మేనేజరుగా ఉండబట్టేగదా అధ్యక్షులవటం జరిగింది. ఇక పోతే, ఉద్యోగపరిమితి 55 ఏళ్లేగదా? షష్టిపూర్తి అయినంత వరకూ ఉద్యోగం ఊడకుండా ఎలా న్వారదు కొంది? పదవీ విరమణచేస్తే వారు అధ్యక్షులుగా ఉండడానికి క్లబ్బు రూల్సు యెలా ఒప్పుకున్నాయి? లేక, అడపా దడపా ఇండియా రాజ్యాంగచట్టాన్ని సవరించి పారేస్తున్నట్టు, క్లబ్బు రూల్సుని ఇష్టం వచ్చినట్టు— మాకు చెప్పకా చెయ్యకా మార్చేసేరా? మొదలైన కుశంకలు బయలుదేరడానికి ఆస్కారం లేకపోలేదు. కాని, అసలు సంగతి ఏమిటంటే— ఆఫీసు రికార్డు షీటులో ఆయన వయస్సు ఏభై రెండేళ్ళు మాత్రమే. జాతకరీత్యా షష్టిపూర్తి అయిందనడానికి ఏ మాత్రం సంశయం లేదు. ఆఫీసు విషయాలలో ఆఫీసు రికార్డులబట్టేన్నీ, సాంఘిక విషయాలలో జాతకరీత్యానున్నూ వ్యవహారాలు జరుగుతాయి. అంచేత— ఔనంటారా? మీరు కాదంటారా??

మొత్తానికి షష్టిపూర్తి మహోత్సవంలో అంగీకరించిన విధంగా అధ్యక్షులవారు నా కావ్యఖండాల్ని ఏర్చికూర్చి ఒక సంపుటంగా అచ్చువేయించి షష్టిపూర్తి స్మారకంగా 'ఓం ప్రథమః' అని ప్రకటించేరు.

ఈ సంగతి యెలా తెలిసిందోగాని, 'అతడనేక యుద్ధముల నారితేరిన ఆకతాయి' అని అనిపించుకొన్న మా తాత ఏకాఏకీ వచ్చేడు.

'ఏమిరా నాయనా, నువ్వు గ్రంథకర్త వైనావుట?' అన్నాడు.

'ఆం... ఏదోలే'— అని కొంత సిగ్గు నటిస్తూ అన్నాను

'ఎక్కడ అచ్చు కొట్టించారు?'

'యవ్‌డన్ ప్రెస్ అని మద్రాసులో వుందిలే— అక్కడా!'

'మద్రాసులోనా? అదేం, మీ వూళ్ళో ఆ దబడదక్క తిమ్మయ్యగారి స్వకీయ

ఒక ప్రెస్సుండాలే! అది ఏమయింది?' అన్నాడు మా తాత.

'ఏమీ అవలేదు. ఇక్కడే వుంది. ఏదీ

ముద్రాక్షరశాలేగా?'

'ఆఁ. అదే. నేను 'విఘ్నేశ్వరాభ్యుదయం' అనే ప్రబంధాన్ని చాలా రోజుల క్రిందటే రాశాను లే. అది అచ్చువేయిద్దామన్న

**దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరు కథలు**

1. ఎండుచేపలు
2. నిర్ణయం
3. బంధాలు
4. వక్రరేఖ
5. వెండి అరటాకు
6. సమస్య

## అనామధేయుండి ...

సంకల్పం నీ సంగతి విన్న తర్వాత కలిగింది.'

'అయితే, అది మద్రాసు ప్రెస్సుకి పంపించెయ్యి.'

'వద్దురా అంత దూరాభారం పంపడం నా కిష్టంలేదు. ఆ పుస్తకం కాని పోతే నా చేతో మరి రాయలేను. ఇక్కడే దగ్గరుండి అచ్చుకొట్టించుకుని పోదామని నా తాపత్రయం!' అన్నాడు మా తాత బాధగా.

'నీ తాపత్రయం నాకు అర్థమైంది. కాని, ఈవూరి ముద్రాక్షరశాల చాలా పాతది. అక్షరాలు అరిగిపోయి కనబడవు. ముద్రారాక్షసాలు భారీయెత్తున వుంటాయి!'

'తప్పొప్పుల పట్టిక చివర్ని చేరుస్తే సరి!'

'తప్పొప్పుల పట్టికలో వెయ్యడానికి కొన్ని అక్షరాలు వాళ్ల ప్రెస్‌లో లేవు తప్పొప్పుల పట్టికలోని తప్పులు సూచించే డానికి మరొక అనుబంధ తప్పొప్పుల పట్టిక కావాలి. ఆఖరికి అసలు గ్రంథం కంటె 'తప్పొప్పులపట్టిక గ్రంథం' ఎక్కువవుతుంది.'

'మరీ విపరీతంగా చెప్తున్నావే! పెరటి చెట్టు మందుకి పనికిరాదు!'

'నమ్మి చెడినవాడు లేడు— నమ్మక—'

'అన్నా గట్టి చిక్కే నే' అని తల బట్టి తల గోక్కున్నాడు మా తాత. నేను ఉపక్రమించేను :

'తాతా, ఈ మధ్యవారు 'చాటుపద్య మణిమంజరి' వేశారు. అందులో 'సస్యము శీతలగజపం, చాస్యము...' అని గుద్దేరు'

'అలా కాదురా, 'నస్యము శీతలగజసంచాస్యము' కదురా?'

'ఔను. గాని, 'న' అరిగిపోయి 'స' అయింది. (ఇంకా వుంది)

# దీపావళి కథల బాలట్ పత్రం

**దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరు కథలలో నాకు ఉత్తమమని తోచిన వరుసలో ఆరు కథలు :**

| | |
|---|---|
| మొదటి కథ | |
| రెండవ కథ | |
| మూడవ కథ | |
| నాలుగవ కథ | |
| అయిదవ కథ | |
| ఆరవ కథ | |

పంపేనవారి పూర్తిపేరు :..............................................

చిరునామా :..............................................

..............................................

..............................................



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# దీపావళి కథల బాలట్ పోటీ

## మొదటి బహుమతి రు. 250
## రెండవ బహుమతి రు. 200
## మూడవ బహుమతి రు. 150

# "నాకు నచ్చిన దీపావళి పోటీ కథలు"

**1972 దీపావళికి ఆంధ్రసచిత్ర వారపత్రిక నెలకొల్పిన దీపావళి కథల పోటీ వివరాలు ఇంతకుముందే ప్రచురించాము.**

*ఈ సంచికలో ఉత్తమ కథలుగా ఎన్నికైన ఆరు కథల ప్రచురణ పూర్తి అవుతుంది.*

ఈ ఆరు కథలలో వరుసగా ఏవి ఉత్తమమైనవో నిర్ణయించి పాఠకులు ఎన్నుకునేందుకు ఒక బాలట్‌ని నిర్వహిస్తున్నాము.

**బాలట్‌తోపాటు వ్యాసరచన పోటీని ఒకదానిని నిర్వహిస్తున్నాము.**

పోటీకి వచ్చిన వ్యాసాలలో ఉత్తమమైన మూడింటికి వరుసగా రు. 250 మొదటి బహుమతి, రు. 200 రెండవ బహుమతి, రు. 150 మూడవ బహుమతి ఇవ్వబడతాయి.

ఈ పోటీకి సంబంధించిన యితర వివరాలు నిబంధనలు ఈ క్రింద యిస్తున్నాము.

## ముగింపు తేది 25-11-1972

1 ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక (10—11—72), ఈ సంచిక (17—11—72)లలో ఉత్తమ కథలుగా ఎన్నికై ప్రచురింపబడిన ఆరు కథలలో పాఠకులు తమకి ఉత్తమమని తోచిన వరుసలో మొదటి కథ, రెండవకథ, మూడవకథ, నాలుగవ కథ, అయిదవ కథ, ఆరవ కథలని ఎన్నుకుని తమ ఎన్నికకి కారణాలని వివరిస్తూ, <u>'నాకు నచ్చిన దీపావళి పోటీ కథలు' అన్న శీర్షిక క్రింద ఒక వ్యాసం రాసి పంపాలి.</u>

2. పాఠకులు తాము ఉత్తమమని నిర్ణయించిన వరుసలో ఆరు కథల పేర్లని ఈ పేజిలలో యివ్వబడిన బాలట్‌పత్రంలో నింపి వ్యాసంతోపాటు పంపాలి.

3. పోటీకి పంపే వ్యాసం, ఒక అరఠావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెండు రెట్లు)ని మించి ఉండరాదు. సిరాతో రాసి ఉండాలి. కాగితానికి ఒక వైపే రాసి పంపాలి

4 ఒక బాలట్‌పత్రంతోపాటు ఒక వ్యాసం మాత్రమే పంపాలి. బాలట్ పత్రాలు జతపరచని వ్యాసాలు పోటీకి స్వీకరింపబడవు.

5 ప్రతి వ్యాసం వ్రాత ప్రతిమీద, రాసిన వారి పూర్తి పేరు, చిరునామా ఉండాలి

6 బాలట్ పత్రంలో కూడా బాలట్‌పత్రం, వ్యాసం పంపేవారి పూర్తి పేరు, చిరునామా ఉండాలి.

7 కవరుమీదా, వ్యాసం వ్రాత ప్రతిమీదా 'దీపావళి కథల బాలట్ పోటీ'కి అని స్పష్టంగా రాయాలి.

8. బాలట్‌పత్రం, వ్యాసం 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1'కి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు

9 <u>పోటీ ముగింపు తేదీ 25—11—1972</u>

10. పోటీకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకుడిదే ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపటానికి వీలులేదు

11. ఎటువంటి పరిస్థితిలోనూ పోటీకి పంపిన వ్యాసాలు తిప్పి పంపబడవు.

12 బాలట్ పోటీ ఫలితాలు 29—12—1972 తేదీగల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురింపబడతాయి.

13. ఇంతకుముందే తెలియచేసినటు బాలట్‌లో మొదటిదిగా ఎన్నికైన కథకి రు. 500, రెండవదిగా ఎన్నికైన కథకి రు 450, మూడవదిగా ఎన్నికైన కథకి రు 400, నాలుగవదిగా ఎన్నికైన కథకి రు. 350, అయిదవదిగా ఎన్నికైన కథకి రు. 300, ఆరవదిగా ఎన్నికైన కథకి రు. 250 ప్రత్యేక బహుమతులుగా ఇస్తాము.

**పాఠకులందరూ మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.**

# ముల్కీ నిబంధనలు అమలులోకి రావాలి

ముల్కీ నిబంధనలు చట్టసమ్మతమయినవిగా సుప్రీంకోర్టు ఇచ్చినతీర్పు ఆంధ్రప్రదేశ్‌లో ఒక ప్రాంతము ప్రజలలో హర్షం, వేరొక ప్రాంతము ప్రజలలో ఆందోళన కలిగించింది.

1918 లో ఒక ప్రత్యేక సంస్థానమయిన నిజాం ప్రాంతంలోని పౌరుల ఉద్యోగాల పరిరక్షణకు మహోన్నత వహించిన నిజాంచే ప్రవేశపెట్టిన ముల్కీశాసనం, ఆ నిజాం ప్రాంతము భారతయూనియన్‌లో విలీనమయిన పిదపా విలువ కోల్పోలేదు. భారత యూనియన్‌లో విలీనమయిన పిదప ఆ హైదరాబాద్ రాష్ట్రం భాషా ప్రాతిపదికపైన మూడుభాగాలుగా విభజింపబడగా ఒక్క తెలంగాణా ప్రాంతములోనే ముల్కీ నిబంధనలు పాటింపబడవలసి వచ్చింది!

తెలంగాణా ప్రాంతీయులకు అన్ని రంగాల లోనూ విస్తృతావకాశాలు లభించడానికి ఏ శాసనం ఏ సమయంలో చేసినా దానికి న్యాయంగానే కాక నైతికంగానూ విలువ వుంటుంది.

అనేక దశాబ్దాలు ఫ్యూడల్ వ్యవస్థలో మగ్గవలసివచ్చిన తెలంగాణా ప్రాంతీయులు తమ నాటిని 'నిజాం రాజు తరతరాల బూజు'గా పిల్చిచి 'ముసలి నక్కకు రాచరికం దక్కునా' అని మలొక్కని తిరగబడ్డారు. ఆ నిజాం సంస్థానముగాని ఆ నిజాంగాని కాలగర్భంలో కలిసిపోయినా ఆ నిజాం చేసిన శాసనం మటుకు 'చిరంజీవి'గా వుంది. ఎంత చెడ్డవాడయినా ఏదో ఒక మంచిపని చేస్తాడు. తెలంగాణా ప్రాంతీయుల మేలుకోరి నిజాంచే చేయబడిన ముల్కీ నిబంధనలను గౌరవించవలసినది తెలంగాణా ప్రాంతీయులు గాదు! ఆంధ్రప్రాంతీయులు!!

**ముల్కీ నిబంధనలు అమలుపరచాలి**

ముల్కీ నిబంధనలను అమలుపరచడంలో ఆలస్యంగాని, తెలంగాణా ప్రాంతీయులకు అన్యాయంగాని జరగకూడదు.

సుప్రీంకోర్టు తీర్పువలన ఆంధ్రులు తమకు ఏదో అన్యాయం జరిగిపోతుందని ఆందోళన వ్యక్తపరుస్తున్నారు. 'తెలంగాణా ప్రజల హక్కులకు భంగము కలగకుండా, ఆంధ్ర ఉద్యోగులకు చిక్కులు ఏర్పడకుండా, రాష్ట్రసమగ్రతకు భంగము కలగకుండా ఈ సమస్యకు పరిష్కారం కనుగొనాలి' అంటున్నారు. ఇది అర్థంలేని వాదన.

ముల్కీరూల్స్‌ని సవరించే అధికారంగాని, రద్దుచేసే అధికారంగాని పార్లమెంట్‌కి వుంది. తెలంగాణా ప్రజల హక్కులు కాపాడవలసిన ఈ 'చరిత్రాత్మక ఘట్టం'లో 'ప్రజల న్యాయస్థానం' తప్పుదోవన పోకూడదు.

తెలంగాణా వెనకబడిన ప్రాంతమయినా ఆ ప్రాంతములో ఒక మహానగరం వుంది. ఆ మహానగరమే ఆంధ్ర–తెలంగాణా అనే ఆంధ్రప్రదేశ్‌కి రాజధాని కావడం అన్ని అనర్థాలకు మూలమని కొంతమంది ఆంధ్రప్రాంతానికి చెందిన రాజకీయనాయకులు అభిప్రాయపడుతున్నారు. అందుకే హైదరాబాద్‌ని స్వేచ్ఛామండలముగా చేయాలని వీరు వాదిస్తున్నారు. హైదరాబాద్‌లో ఉద్యోగాలకుగాని, విద్యాసంస్థలలో ప్రవేశానికిగాని ఏ నిబంధనలు అడ్డురాకూడదని వీరి వాదన. ఒక్క హైదరాబాద్‌పై ఈ 'అదృష్టం' ఎందుకు పెట్టారు? తెలంగాణా అంతటినీ స్వేచ్ఛా మండలముగా ప్రకటించాలని ఎందుకు వీరు వాదించరు? మహానగరంమీద మోజా?

రాష్ట్రరాజధానిలో ఆ రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల ప్రజలకు అన్ని రంగాలలోనూ సమానావకాశాలు లేకపోవడం ఒక విధంగా ఆశ్చర్యకరమయిన విషయం. కాని హైదరాబాద్ తెలంగాణా అనే వెనకబడిన ప్రాంతములోని నగరం కనుక ఈ నగరంలో తెలంగాణా ప్రాంతీయులకి విస్తృతావకాశాలు వుండాలని ఏ సుప్రీంకోర్టు న్యాయ నిర్ణయం చేయనక్కరలేదు. ఈ నిర్ణయాన్ని ఆంధ్రులు గౌరవిస్తారు.

**మంత్రులు ముల్కీలా?**

ఇదే సమయంలో ఒక 'చిక్కుప్రశ్న' ఉత్పన్నమవుతోంది. హైదరాబాద్‌లో ఆంధ్రులకి స్థానం లేకపోయినా అదే హైదరాబాద్ రాజధానిగాగల ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్రప్రాంతానికి చెందిన వ్యక్తులు మంత్రి పదవులు అనే 'ఉద్యోగాలు' ఎలా చేయగలుగుతున్నారు. వీరు ముల్కీలా? అంతేకాక శ్రీ పి. వి. నరసింహారావు ముందర ముఖ్యమంత్రి పదవిలోవున్న ముగ్గురూ నాన్–ముల్కీలే! వీరికి ఈ అధికారం ఏ









సుప్రీంకోర్టు ఇచ్చింది? నిజాం ని శాసనంతో ఏ కాలంలో వీరికి పట్టాభిషేకపు ఏర్పాటు చేశాడు? రాజధానిలో ప్రభుత్వ కార్యాలయాలలో ఉద్యోగాలు చేయడానికి అవకాశం ఒక్క ముల్కీలకే వుంటుంది. కాని అదే రాజధానిలో మంత్రి పదవులలో నాన్-ముల్కీలు వుండవచ్చు. ఏ తర్కశాస్త్రానికి లొంగని విషయమిది.

ఆంధ్ర ప్రాంతీయులు ముల్కీ నిబంధనలు అమలుపరచే పక్షంలో రాష్ట్రం రెండుగా చీలిపోవాలని అభిప్రాయపడుతున్నారు.

తెలంగాణా ప్రాంతీయులు ముల్కీ నిబంధనలు అమలుపరచడమేకాక ఆంధ్రప్రదేశ్ సమగ్రతా కాపాడబడాలని కోరుకుంటున్నారు.

ముల్కీ నిబంధనలు అమలులోకి వస్తే ఆంధ్ర ప్రాంతీయులకు తెలంగాణా ప్రాంతములోవున్న రాష్ట్ర రాజధానీ నగరంలో ఏ రంగములోనూ అవకాశాలుండవు కాని ముల్కీ నిబంధనలను రద్దుచేసే అధికారం గాని, సవరించే అదికారం గాని ఎవరూ స్వీకరించడము న్యాయంకాదు కనుక ఆంధ్ర ప్రదేశ్ రెండుగా చీలిపోవడమే ఏకైక మార్గం.

తెలంగాణా ప్రాంతీయులకి ముల్కీ నిబంధనలు అమలులోకి రావాలని కోరటంలో పూర్తి హక్కువుంది. కాని అదే సమయంలో ఆంధ్రప్రదేశ్ సమగ్రతని కోరడంలో వారికి ఏవిధమయిన హక్కూ లేదు.

రాష్ట్రసమగ్రతని వాంఛించే తెలంగాణా నాయకులు తెలంగాణా ప్రాంతీయుల పరిరక్షణాలను మటుకు కోల్పోదలచుకోలేదు. ముల్కీ నిబంధనలు కాపాడబడవలసిన శుభ తరుణంలో రాష్ట్ర సమగ్రత కాపాడాలనడం అశుభమే అవుతుంది.

## భావసమైక్యతా ?

ఆంధ్రుడు కాని వాడెవడయినా ముల్కీ అనే విపరీతార్థం లభించింది. తెలంగాణాకు ప్రాంతీయ కమిటీ ఏర్పడింది. తెలంగాణాకు ప్రత్యేక బడ్జెట్ ప్రవేశపెట్టబడింది. అదనపు చీఫ్ సెక్రటరీ పదవి సృష్టించబడింది. సర్వీసులను విడదీయడం జరిగింది. ఇన్ని జరిగినా రాష్ట్రవిచ్ఛిత్తి జరగలేదు. ముల్కీ నిబంధనలు న్యాయమయినవే ననే తీర్పులభించిన తరుణంలో భావసమైక్యతపేర ఈ రెండు ప్రాంతాలను ఏ 'ఇందిరాజాలం' కలిపి వుంచలేదు,

1955 డిశంబర్‌లో ప్రధాని నెహ్రూ నాగార్జునసాగర్‌కి శంఖుస్థాపన చేస్తూ 'మహానది కృష్ణవేణికి ఈ ప్రక్క ఆంధ్ర, ఆ ప్రక్క తెలంగాణా వున్నాయి. ఈ నది ఒకభాష మాట్లాడే ఈ ప్రజని విడదీయలేదు' అన్నారు. ఈరోజున ప్రధానమంత్రి నెహ్రూ తనయ తండ్రి వాక్కుని తప్పిక కాదంటుంది!

—ఒక నాన్‌ముల్కీ




ఎడంచేత్తో అద్దం పట్టుకొని తన మొహాన్ని పరీక్షగా చూసుకున్నాడు రామం. నల్లటి చర్మం, లోతుకుపోయిన కళ్ళు, లోపలికి పోయిన దవడలు, తెల్లబడి పోతున్న తలవెంట్రుకలు—ఇదీ ప్రతిరూపం ఆ అద్దంలో!

భుజంమీద తువ్వాలతో అద్దాన్ని బలంగా తుడ్చాడు. మళ్ళా మొహాన్ని చూసుకున్నాడు మార్పుకోసం వెతికాడు, కానీ మొదటి ప్రతిబింబానికన్నా, ఇప్పటి ప్రతిబింబం అతన్ని నిరుత్సాహ పరిచింది. అద్దాన్ని తుడవకుండా వున్నా పోయేది అనుకున్నాడు.

గడ్డం గీసుకున్నాడు. స్నానం చేసాడు. ఒళ్ళుతుడుచుకొని అద్దంలో మళ్ళా తన మొహాన్ని చూసుకున్నాడు దువ్వెనతో తల తృప్తిగా దువ్వుకున్నాడు కొద్దిగా పౌడరు చేతల్లో వెల్లుకొని మొహానికి మరీతెల్లగా కనపించకుండా రుద్దుకున్నాడు. మళ్ళా అద్దంలోకి చూసుకున్నాడు. తల వంకీలు తిరిగివుంది. తెల్ల వెంట్రుకలు మొదట కనిపించినంత విపరీతంగా కనిపించడంలేదు.

బట్టలు వేసుకున్నాడు. సూట్‌కేస్‌లో ఓ రెండుజతల బట్టలు సర్దాడు. క్రితం రాత్రే అమ్మా నాన్నకి చెప్పాడు 'ఆఫీసు పనిమీద వూరెళుతున్నట్టు.'

'అమ్మా! వెళ్ళొస్తాను' అంటూ ఇంట్లోంచి బైటపడ్డాడు. రిక్షావేసుకొని స్టేషన్‌కి చేరాడు,

రామానికి ఇరవై అయిదోఏట ఉద్యోగం వచ్చి మొదటి పోస్టింగ్ ఏవూళ్ళో అయితే అయిందో, ఆ వూరికి ఈనాడు అతను మళ్ళా బయలుదేరాడు.

దాదాపు నాలుగయిదేళ్ళక్రితం—

ఉద్యోగం వచ్చిన కాయితాలు తీసుకొని రామం ఆ వూరు వెళ్ళాడు. ఆఫీసులో చేరాడు. వెంటనే రూము ఎక్కడా దొరక్క ఆఫీసులో వుండిపోయాడు రెండుమూడు రోజులు ఆ వూళ్ళో సంసారాలకయితే రెండు మూడు గదులున్న వాటాలు దొరుకుతాయిగాని, విడిగా రూము దొరకడం చాలా కష్టమైపోయింది. అటువంటి సమయంలో అతని అవస్థచూసి అతనితోపాటు అదే ఆఫీసులో మరో సెక్షన్‌లో పనిచేస్తున్న సుబ్బారావు ఓ రోజు వాళ్ళ బాబాయి ఇంటికి తీసుకొని వెళ్ళాడు

అదొక చిన్న పెంకుటిల్లు. మొత్తం నాలుగు గదులు. వాళ్ళు ఎక్కువగా మూడు గదులు మాత్రమే వాడుకుంటున్నారు. నాలుగోగది ఖాళీగానేవుంది, ఏవో రెండు కుర్చీలూ, బుక్ షెల్ఫులూ తప్ప. ఆ గదికి విడిగా తలుపువుంది—బయటినుండి రాకపోకలకు.

ప్రక్కనే బావి వుంది. పెంకుటింటి చుట్టూ కాస్త స్థలం, అందులో కొన్ని పూలచెట్లు, కొన్ని కాయకూరల పాదులూ వున్నాయి. చుట్టూ గోడవుంది.

అక్కడంతా చాలా ప్రశాంతంగావుంది.

'ఏరా బావున్నావా? రా! కూర్చో' సుబ్బారావు బాబాయి సుబ్బారావునిచూసి అన్నాడు.

'మీరూ కూర్చోండి' అన్నాడు రామం వంకకూడా చూసి.

ముగ్గురూ కూర్చున్నారు.

'ఏరా! కనిపించడం మానేశావేం? అసలు రావడం మానేశావు ... అవునులేరా, నీకుకూడా పెద్దతనం వస్తోంది కదూ, నన్ను మర్చిపోతున్నావు' బాధగా అన్నాడాయన.

'తీరికలేక రావడంలేదు బాబాయి. చాలా దూరం కదా!' అన్నాడు సుబ్బారావు.

'అవునురా! మీరందరూ నన్ను దూరం చేసారు...నేనంటే చివరికి నీక్కూడా యిష్టం పోతోంది! అవునా? నిజం చెప్పరా!'

'బాబాయ్! నువ్వు ఏదో వూహించుకొని అనవసరంగా బాధపడిపోతున్నావ్'.

'ఏహోరా! ఈమధ్య నేను ఒంటరివాడ్నయిపోయాననీ, అందరికీ దూరం అయిపోయానని నాలో నేను కుమిలిపోతున్నాను...ఒరే! సుబ్బారావు!...నేనెంతోకాలం బ్రతకనురా' అన్నాడాయన.

రామానికి ఏవీ అర్థంకాలేదు మౌనంగా కూర్చుండిపోయాడు.

'బాబాయ్! ఈయన పేరు రామం, మా ఆఫీసులో కొత్తగా జేరారు. వీరిది బెజవాడ. ఈయన వుండడానికి రూము కోసం చాలా వెతికారు, కానీ దొరకలేదు. మన యింట్లో ఏదన్నా వుందేమోనని తీసుకొచ్చాను, అన్నట్టు ఈయన మంచి ఆర్టిస్టుకూడా, ఇవాళే తెల్సింది. నువు కూడా చిన్నప్పుడు బొమ్మలు బాగా వేసేవాడివటగా. నువ్వు ఇకనుంచి ఒంటరిగా ఫీలవ్వనవసరం లేదు, ఈయనతో నీకు మంచి కాలక్షేపం' అని సుబ్బారావు రామం వంక తిరిగి 'ఈయనగారు మా బాబాయి. పేరు జానకి రామయ్య, తాలూకాఫీసులో హెడ్ క్లార్కుగా చేసి రిటైరయ్యారు' అన్నాడు.

జానకి రామయ్య కాసేపు తన మనసులోని బాధని మర్చిపోయి రామం వైపు చూసి నవ్వి 'మీరూ బొమ్మలు వేస్తారన్న మాట' అన్నాడు. ఆయన మొహంలో కొద్దిగా కళ వచ్చింది.

'అమ్మా రేఖా! మంచినీళ్ళు పట్టామ్మా!' అని లోపలికి చూసి పిలిచాడు జానకి రామయ్య.

రేఖ రెండు గ్లాసులతో మంచినీళ్ళు తెచ్చియిచ్చింది, సుబ్బారావుకి రామానికి.

'ఏం అన్నయ్యా! అసలు రావడం మానేశావూ?' అంది సుబ్బారావునిచూసి.

సుబ్బారావు మంచినీళ్ళు తాగుతూ జవాబివ్వలేదు. రేఖ లోపలికెళ్ళి మంచి గ్లాసుతో తండ్రికి మంచినీళ్ళు తెచ్చియిచ్చింది.

'చెల్లాయిలు బాగున్నారా?' అడిగింది.

'వాళ్లకేం, బ్రహ్మాండంగా వున్నారు... దిగులా, విచారమా?' నవ్వాడు సుబ్బారావు.

'అలా లేకుండా వుండడమేగా జీవితానికి కావల్సింది' జానకి రామయ్య అన్నారు.

రేఖ మంచినీళ్ళగ్లాసులు తీసుకొని లోపలికి వెళ్లిపోయింది.

'మా అమ్మాయి రేఖ! ఎలిమెంటరీ స్కూల్లో టీచర్గా చేస్తోంది' జానకి రామయ్య రామాన్ని చూసి అన్నాడు.

రామం అలాగా అన్నట్టు తల కదిపాడు.

'ఏం బాబాయి? ఏవిటి మరి...రూము అద్దెకిస్తావా?'

'ఒక రూమే కదా!...అలాగే!' అన్నాడాయన.

రామం మనసు కుదుటపడింది—రూము విషయం తేలినందుకు

'మరి అద్దె సంగతి' సుబ్బారావు అడిగాడు.

జానకిరామయ్య నవ్వాడు 'అద్దెదేముందిరా! ..ఎంతో కొంత...'

'సరే, ఇప్పుడు నేనే రెంట్ కంట్రోలర్ ననుకో...చూడండి రామం! ఈ గదికి మీరు పాతిక రూపాయలివ్వండి' అన్నాడు సుబ్బారావు నవ్వుతూ.

'అలాగే!' ఒప్పుకున్నాడు రామం.

జానకిరామయ్య దానికి 'చూడండి రామంగారు! మావాడు ఏదో అడిగాడు కదాని మీరు ఒప్పుకోకండి ... మీకు ఎంత ఇవ్వాలనిపిస్తే అంతే ఇవ్వండి...' అన్నాడు.

'అబ్బే! సుబ్బారావుగారు చెప్పారని కాదు, పాతిక రూపాయలు ఇవ్వడం నాకు యిష్టమే ...పోతే మా ఆఫీసులో పెట్టె బెడ్డింగూ వున్నాయి. రేపు ఉదయం వస్తాను. మీకు అభ్యంతరమయితే రెండు మూడు రోజులు ఆగే వస్తాను' అన్నాడు రామం.

'మీరిప్పుడే వచ్చినా నాకేమీ అభ్యంతరం లేదు' అన్నాడు జానకిరామయ్య.

రేఖ కాఫీ తీసుకొచ్చింది కప్పులతో. ముగ్గురికీ ఇచ్చింది. ముగ్గురూ తాగారు.

'వస్తాం బాబాయ్!' అంటూ సుబ్బారావు లేచాడు. రామం కూడా లేచాడు.

'అప్పుడప్పుడూ వస్తూ వుండరా!' సుబ్బారావు చేతిని తన చేతిలోకి తీసుకుని అన్నాడు జానకిరామయ్య.

'నేను వస్తాను...తప్పకుండా...నువ్వేమీ బాధపడకు' అన్నాడు సుబ్బారావు.

'నేనున్నాగా, సుబ్బారావుగార్ని మీక్కావలసినప్పుడల్లా వెంట తీసుకొస్తాను' అన్నాడు రామం. దానికి జానకిరామయ్య హాయిగా నవ్వుకున్నాడు.

జానకిరామయ్య ఒక ముస్లిమ్ యువతిని ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు. ఆ కారణంగా వాళ్ళిద్దరూ తమవారికి దూరం అయ్యారు వారికి రేఖ పుట్టింది. చదువు చెప్పించారు ఎస్సెల్సీ వరకు. తర్వాత టీచర్ ట్రైనింగ్ పొంది టీచర్గా చేరింది. జానకిరామయ్య భార్య రేఖ వివాహం ఓ సమస్య అని గమనించింది. ఆర్థిక పరిస్థితి కూడా అనుకూలంగా లేదు. ఆమె అనారోగ్యానికి తోడు రేఖ వివాహ సమస్య ఆమెని మరింత కృంగదీసింది. ఫలితంగా ఆమె మరణించింది. అప్పట్నుంచి జానకిరామయ్య ఒంటరివాడయ్యాడు. రేఖ పెళ్ళి గురించి భయపడ్డం మొదలుపెట్టాడు. తనవాళ్లెవరూ ఈ సమయంలో ఆదుకోవడంలేదనే బాధ ఎక్కువయింది ఆయనకు. 'నా పెళ్ళి గురించి నువ్వేమీ బాధపడకు నాన్నా! నాకు ఉద్యోగం వుంది. ఈ వయసులో నిన్ను వదిలి వెళ్ళలేను కూడా' అని రేఖ ఎప్పుడూ అంటూ వుంటుంది. కానీ ఆయనలో మార్పు రావడంలేదు.

ఈ విషయాలన్నీ రామానికి సుబ్బారావు తర్వాత చెప్పాడు.

రామం సామానుతో రూములో ప్రవేశించాడు.

రామానికి జానకిరామయ్యతో కాలక్షేపం కుదిరింది బాగా. ఇద్దరూ రేఖా చిత్రాల గురించి, నీటిరంగు చిత్రాల గురించి, ఆధునిక చిత్రకళ గురించి ..మాట్లాడుతూ కాలం గడిపేవారు. జానకిరామయ్య తన చిన్నతనంలో సంగతులన్నీ చెబుతుండేవాడు రామానికి. అవన్నీ రామం ఆశ్చర్యంగా వింటుండేవాడు

'రేఖా! ఈ బొమ్మలు చూసావా? రామంగారు వేసారు...ఎంతో బాగున్నాయి కదూ?' అన్నాడు జానకిరామయ్య రేఖకు రామం వేసిన కొన్ని చిత్రాలను చూపిస్తూ.

'అవును నాన్నా! చాలా బాగున్నాయి...

నువ్వు కూడా మళ్ళా వేస్తూ వుండ కూడదూ...' అంది రేఖ తండ్రి వంక చూసి.

'అవునమ్మా! బొమ్మలు వేస్తూవుంటే, కాలం, కష్టాలూ ఏవీ తెలియవు...వేస్తాను ...మళ్ళా వేయడం మొదలెడతాను' అన్నాడు.

'రంగులు, డ్రాయింగ్ పేపరు నా దగ్గ రున్నాయి. మీక్కావలిసినప్పుడు అడగండి' రామం అన్నాడు.

రోజులు గడుస్తున్నాయి.

ఆ రోజు రామం జీతం తీసుకున్నాడు. సాయంత్రం ఆఫీసు అవగానే రూము కెళ్ళాడు. రూము అద్దె ఇవ్వడానికి జానకి రామయ్య ఇంట్లోకి వెళ్ళాడు. కానీ ఆయన కనిపించలేదు.

'నాన్నగారు లేరా ?' అడిగాడు.

'లేరు; ఇప్పుడే అలా లైబ్రరీకి వెళ్ళారు' అంది రేఖ.

'రూము అద్దె...' రామం చేతిలోని డబ్బు చూపిస్తూ అన్నాడు.

'మా నాన్న వస్తారు, ఆయనకిస్తారా?' అంది.

'అలాగే!' అంటూనే వెనుతిరిగాడు.

'కూర్చోండి' అంది రేఖ.

రామం రేఖ వైపుకి తిరిగాడు. రేఖ లోపలికెళ్ళి కాఫీ తెచ్చి యిచ్చి 'తీసుకోండి' అంది.

'అబ్బే! ఎందుకండీ కాఫీ అవీను' రామం మొహమాట పడ్డాడు.

'కాఫీయే! అవీ ఇవీ లేవు' నవ్వింది రేఖ.

రామం కాఫీ కప్పు అందుకున్నాడు.

'మీరు వచ్చిన తర్వాత మా నాన్న కొత్తగా కనపడుతున్నారు. ఎప్పుడూ నవ్వుతూ కులాసాగా గడపగలుగుతున్నారు. ఇదివరకు ఆయన్నిచూసి నేను ఎప్పుడూ భయపడుతుండేదాన్ని, ఆయనకి ఏరోజు ఏమవుతుందోనని. ఆయన ఆరోగ్యం కుదుటపడడానికి కారణం మీరు — మీకు చాలా ఋణపడివున్నాను. ఆయన ఎంత కాలం బతికితే అంతకాలం నాకు ధైర్యంగా వుంటుంది. ఆయన లేకపోతే నాకు దిక్కెవరు?' కళ్ళల్లో నీరు తిరుగుతుండగా రామంతో అంది.

'ఆయనకేం ఫర్వాలేదు, మీరు బెంగ పెట్టుకోకండి' కప్పు ఆమెకు తిరిగి యిస్తూ అన్నాడు.

# వక్ర రేఖ

అప్పుడే జానకి రామయ్య లోపలికి అడుగు పెట్టాడు. కుర్చీలో కూర్చున్న రామంలేచి 'ఇదుగోండి—అద్దె' అంటూ ఇచ్చాడు.

జానకి రామయ్య నవ్వి 'ఒకసారి మీరు ఆలస్యంగా అద్దె ఇవ్వకూడదూ? చూడా లనివుంది' అన్నాడు.

రామం నవ్వి వూరుకున్నాడు.

ఆ రోజు రాత్రి—

రేఖ అరుపు వినపడింది. రామం అప్పుడె మగతగా నిద్రపోతున్నాడు. ఆమె అరుపు వినగానే గబగబాలేచి జానకి రామయ్య ఇంటి తలుపు తట్టాడు.

'నాన్నా! నాన్నా!' అంటోంది రేఖ ఏడుస్తూ.

బైటవున్న రామానికి అర్థంకాలేదు. తలుపు గట్టిగా కొట్టాడు. 'ఏవండీ... ఏవండీ...' అన్నాడు గట్టిగా.

ఓనిముషం తర్వాత రేఖ తలుపుతీసింది. ఆమె వణికిపోతోంది. కళ్ళనిండా నీళ్ళు...

'నాన్న...నాన్న...రండి...నాకు భయంగా వుంది' అంటూ లోపలికి పరుగెట్టింది. రామంకూడా అనుసరించాడు.

మంచంమీద జానకి రామయ్య గుండె పట్టుకొని విపరీతంగా రొప్పుతున్నాడు. రేఖ తండ్రిని రెండుచేతుల్తో పట్టుకొని 'నాన్నా! రామం వచ్చారు...' ధైర్యంగా మాట్లాడ్డానికి ప్రయత్నిస్తోంది ఏడవకుండా.

రామం జానకి రామయ్యని పట్టుకు న్నాడు. 'జానకి రామయ్యగారు ... ఏవి టండీ?...మీకేం భయంలేదు...' అంటు న్నాడుగానీ ఏంచెయ్యాలో తోచడంలేదు అతనికి. 'మీరు దగ్గరేవుండండి. నేను రిక్షా పిలుచుకొని వస్తాను ... హాస్పిటల్‌కి తీసుకెళదాం' అంటూ బయటికివచ్చి తన గదిలో హేంగర్‌కి వేలాడుతున్న ఓచొక్కా అందుకొని, వేసుకుంటూ రోడ్డుమీదికి వచ్చాడు. రిక్షా దగ్గరిలో కనిపించలేదు. వందగజాలు గబగబా నడుచుకుంటూ వెళ్ళాడు. అక్కడో రిక్షా కనపడింది. 'ఇదిగో రిక్షా. త్వరగా పద' అంటూ రిక్షాఎక్కి, ఇంటిముందు ఆపించాడు. గబగబా ఇంట్లోకి పరుగెత్తాడు. అప్పటికే ఇరుగు పొరుగువున్న కొంతమందివచ్చి గది నిండిపోయారు.

రేఖ తండ్రిమీదపడి ఏడుస్తోంది. రామం ఆయన శరీరాన్ని తాకాడు. చల్లగా అనిపించింది. ఒక్కసారిగా అతని కళ్ళు నిండి నీళ్లు జలజలా రాలాయి. కాసేపటికి అంతా జనం పోగయ్యారు.

బేరం పోయిందని రిక్షావాడు తన దురదృష్టానికి తిట్టుకుంటూ వెళ్లిపోయాడు.

తెల్లవారింది. కబురుతెలిసి సుబ్బారావు వచ్చాడు. మిగతావాళ్ళు ఎవరూ రాలేదని చెప్పొచ్చు. కర్మకాండలన్నీ సుబ్బారావు దగ్గరుండి జరిపించాడు.

ఇల్లు శూన్యమయింది.

రెండు రోజులు గడిచాయి.

రామం రేఖతో అన్నాడు 'నేను రూము ఖాళీ చేస్తున్నాను'

'ఎందుకని?' అడిగింది రేఖ.

రామానికి ఏం చెప్పాలో తోచలేదు. ఎలా చెప్పాలో తెలీలేదు.

'కారణం లేదా?' అడిగింది మళ్ళా.

'నేను ఇక్కడ వుండడం భావ్యం కాదని నా వుద్దేశ్యం...'

'అదే కారణం అయితే మీరు ఖాళీ చెయ్యనక్కరలేదు. మీ గురించి నాకు భయంలేదు. లోకం గురించీ నాకు భయం లేదు. ఇక నేనెవరికి భయపడదలుచుకో లేదు. నన్ను భయపెట్టేవాళ్ళూ లేరు... ఒకవేళ నా గురించి మీకు భయంగా వుంటే...ఖాళీ చెయ్యొచ్చు' అంది.

ఆమెకు జవాబు చెప్పలేక తిరిగి తన గదిలోకివచ్చి కూర్చున్నాడు. గది ఖాళీచేసే వుద్దేశాన్నుండి విరమించుకున్నాడు.

నెల రోజులు గడిచాయి.

ఇరుగూ పొరుగువారు తనగురించి అనుకోవడం, తను రోడ్డుమీదనుంచి వెళు తుంటే పరీక్షగా వాళ్ళల్లో వాళ్ళు గుసగుస లాడుకోవడం గమనించాడు రామం. పరిస్థితి అర్థం చేసుకున్నాడు

తనవూరికి ట్రాన్స్‌ఫర్ ప్రయత్నాలు మొదలెట్టాడు గట్టిగా.

రేఖ అప్పుడప్పుడూ రామం గదిలో కాసేపు కూర్చుని అతనువేసిన చిత్రాలను చూస్తూ కాలం గడిపేది. ఎంతదూరంగా వుందామన్నా రామానికి వీలుపడలేదు, రేఖ దగ్గరికి వస్తూ వుండడంతో.

రామంచేసిన ప్రయత్నాలు ఫలించి తన వూరికి ట్రాన్స్ఫర్ వచ్చింది. అతని సంతోషానికి మేరలేదు. మళ్ళా తనవూరికి, తల్లిదండ్రులదగ్గరికీ, తన పాత స్నేహితుల దగ్గరికీ వెళ్ళిపోతున్నందుకు సంబరపడ్డాడు.

సాయంత్రం కాగానే తిన్నగా రూముకి వచ్చాడు. బావిదగ్గర రేఖ నీళ్ళుతోడుతూ కనిపించింది.

'నాకు మా వూరికి ట్రాన్స్ఫరయింది' అన్నాడు. రేఖ అతని సంతోషాన్ని గమనించి మెల్లగా నవ్వింది.

'అయితే మీ వూరు వెళ్ళిపోతున్నారన్న మాట' అంది.

నాలుగురోజుల తర్వాత రామం బదిలీ అయ్యాడు. ఆరోజు సాయంత్రం రూములోని కొంతసామాను రోడ్డు ట్రాన్స్పోర్టు ద్వారా పంపేసి, మిగిలిన సామాను సర్దుతున్నాడు రామం, గదిలో.

అప్పుడే రేఖ వచ్చింది.

'ఎప్పుడు వెళుతున్నారు' అడిగింది.

'రేపు ఉదయం' అన్నాడు.

'ఈపూట మా ఇంట్లో భోంచెయ్యాలి.. అడిగితే కాదంటారని ముందే వంట చేశాను' అంది.

'వంట చేశారా?...' ఆశ్చర్యంగా అడిగాడు.

'అవును' అంది.

'ఇక తప్పేదేముంది...మీరిచ్చే కాఫీ కాదనలేకపోతూ వచ్చాను, అలా అలవాటయింది మరి ... ఇక భోజనం తయారు చేశాక... తప్పించుకోడం ఎలా?' అన్నాడు.

'సామాను పూర్తిగా సర్దలేదుగా ఇంకా' అడిగింది.

'లేదు.'

'అయితే సర్దుతూ వుండండి. వంట కాగానే పిలుస్తాను..' అంది. కానీ, 'అయ్యో నిజం తెలిసిపోయిందే' అని ఉలిక్కిపడింది.

'వంట అయిందన్నారు కదా?' అంటున్న రామం మాటలు వినిపించుకోకుండా వెళ్ళిపోయింది రేఖ. రామం నవ్వుకున్నాడు.

రాత్రి ఎనిమిదయింది. రేఖ మళ్ళా రామం గదిలోకి వచ్చింది. 'భోజనానికి లేస్తారా?' అడిగింది

రామం బావిదగ్గిరికివెళ్ళి కాళ్ళు కడుక్కున్నాడు. రేఖ ఇంట్లోకి వెళ్ళాడు.

# వక్రరేఖ

'లోపలికి రండి... కూర్చోండి' అంది లోపలి గదిలోకి పిలుస్తూ.

రామం వడ్డించిన విస్తరిముందు కూర్చున్నాడు. 'అబ్బో! చాలా చేసారు. ఇవన్నీ తినగలనా?' అన్నాడు.

'ఫర్వాలేదు, ఆమాత్రం తినలేరా?'

'తినలేను ... ఈ స్వీట్ తీసేయండి... గారెలు ఇన్నా? ఇవీ తీసేయండి' అన్నాడు. రేఖ తీసుకొచ్చిన ఖాళీ ప్లేట్లో తనకు ఎక్కువయినవి తీసి వుంచాడు.

'మీరు నా కోసమని అనవసరంగా చాలా చేసారు ... తినలేక పోతున్నందుకు ఏమీ అనుకోకండి.'

'మీరు తినలేకపోతే నేను చేసేదేముంది. అసలు మీరు భోజనానికి ఒప్పుకోరనుకున్నాను. మీరు రావడం నా అదృష్టం...' అంది.

రామం రేఖవంక చూసాడు. ఆమె తల వంచుకొని కూర్చుంది ప్రక్కనే.

భోజనం ముగించాడు రామం. ముందరి గదిలోకివచ్చి కూర్చున్నాడు కుర్చీలో. రేఖ గుమ్మానికి ఆనుకొని నిలబడింది— రామాన్ని చూస్తూ.

రెండునిముషాలు గడిచాయి మౌనంగా.

రామం లేచాడు 'ఇక వెళతాను' అన్నాడు.

రేఖ గిరుక్కున అటువేపుకి తిరిగి పోయింది.

రామానికి అర్థం కాలేదు.

'ఏమండీ?' దగ్గరికెళ్ళి పిలిచాడు.

రేఖ ఇటువేపుకి తిరగలేదు. ఆమె ఏడుస్తోందని గ్రహించాడు. ఏం చెయ్యాలో తోచలేదు. తన గదిలోకి మామూలుగా వెళ్ళిపోదామనుకున్నాడు. అది సభ్యత కాదని వూరుకున్నాడు.

'రేఖా!...' ఇలా చూడండి!' అంటూ మొదటిసారిగా పేరుపెట్టి పిలిచాడు. కానీ రేఖ వెనక్కితిరిగి చూడలేదు.

రామం దగ్గరికివెళ్ళి అప్రయత్నంగా ఆమె తలపై చేయివేశాడు రేఖ రామం వైపు తిరిగి అతని గుండెలమీద వాలిపోయింది.

అనుకోకుండా జరిగిన ఈ సంఘటనకు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు రామం రేఖ ఏడుపు ఆపలేదు. ఆమె రెండు భుజాలను పట్టుకుని 'ఇలా చూడండి' అన్నాడు

రేఖ అతని చేతులోంచి విడిపోయి అవతలి గదిలోకి వెళ్ళిపోయింది. రామం రెండు నిముషాలు నిలబడి, నిట్టూర్చి తనగదిలోకి తిరిగి వచ్చేశాడు.

రామం పడుకున్నాడేగానీ నిద్రపట్టలేదు.

'రేఖ తనని ప్రేమిస్తోంది. తనంటే ఆమెకు ఇష్టం. రేఖని తనదాన్నిగా చేసుకుంటే? తను సంఘంలో నిలబడగలడా? తనకంత ధైర్యం వుందా? రేఖని పెళ్ళిచేసుకుంటే తన ఇద్దరి చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు ఎలా అవుతాయి? జానకిరామయ్యలాంటి మనిషే తట్టుకోలేకపోయాడు. తనెంత? తనకు రేఖను చేసుకునే ధైర్యం లేదు...కానీ రేఖని ఎవరు చేసుకుంటారు? ఇప్పటికే ఇరవై రెండు, ఇరవై మూడుఏళ్ళు దాటివుంటాయి. జీవితాంతం ఎవరూచేసుకోకుండా అలా వుండిపోతుందా?...ఒంటరిగా ఎలా బ్రతుకుతుంది? అది ఆమెకు సాధ్యమా? కులం, గుణం, సంప్రదాయం అన్నీ సరిగ్గావుండికూడా ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావడంలేదు. ఇటువంటి పరిస్థితుల్లో రేఖను ఎవరు చేసుకోగలరు? అంతటి పుణ్యాత్ముడు, సాహసవంతుడు ఎవరుంటారు?'

రామం ఆలోచించలేకపోయాడు. ఎంత ఆలోచించినా తనకు రేఖని చేసుకోగల ధైర్యం లేదనుకున్నాడు.

తెల్లవారింది.

రిక్షా పిలిచి సామాను పెట్టించాడు అందులో.

రేఖ వాళ్ళ గుమ్మంలో నిలబడి వుంది. రాత్రి జరిగింది ఏమీ జ్ఞాపకం లేనిదానికి మల్లే కనిపించింది.

'వెళ్ళొస్తాను...రేఖా!' అన్నాడు.

'వెళ్ళిరండి' రేఖ నవ్వగలిగింది, కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నా.

రామం గబగబా వెనక్కి తిరిగివచ్చి రిక్షాలో కూర్చున్నాడు. రిక్షా కదిలింది.

సుబ్బారావు రామాన్ని స్టేషన్లో కలుసుకున్నాడు.

నాలుగయిదేళ్ళు గడిచిపోయాయి—

ఈ నాలుగయిదేళ్ళ కాలంలో రామం అప్పులుచేసి తన ఇద్దరి చెల్లెళ్ళ పెళ్ళి

చేసాడు. అందరికీ మంచివాడనిపించుకున్నాడు. తనూ పెళ్ళి చేసుకుందామనుకునే సరికి చుట్టూ అప్పులు కనిపించాయి. ఈ పరిస్థితుల్లో పెళ్ళిచేసుకోకూడదని ఆగిపోయాడు. నాలుగేళ్ళు దాటినా అప్పులు తీర్చవలసినవి మిగిలిపోయాయి. తల్లిదండ్రులు పెళ్ళిచేసుకోమని బలవంతం చేశారు. 'నీ పెళ్ళి కుదిరితే నీకొచ్చే కట్నంతో అప్పులు తీరిపోతాయి' అన్నారు. వాళ్ళ బలవంతంమీదే ఆరేడు సంబంధాలు చూసాడు. కానీ అమ్మాయిలు నచ్చలేదు. ఏదో ఓ లోపం. అతను చిత్రకారుడు కావటంతో మరింత చిక్కువచ్చింది. అతనికి ఎవరూ అందంగా కనిపించలేదు. రామానికి విసుగుపుట్టింది. ఇంకెవర్నీ చూడకూడదనుకున్నాడు. కానీ తల్లిదండ్రుల అతి బలవంతంమీద మరో సంబంధం చూసాడు. అమ్మాయి అతనికి నచ్చింది.

కాని కట్నందగ్గర సంబంధం పోయింది. వాళ్ళు రెండువేలకన్నా ఎక్కువ ఇవ్వలేమన్నారు. 'మావాడు మంచి ఉద్యోగంచేస్తున్నాడు. అంత తీసి పారేసినట్టు రెండువేలకంటే ఎక్కువ ఇవ్వం అంటారా' అంటూ రామం తండ్రి ఆ సంబంధం వద్దనుకున్నాడు.

'కట్నం దేముంది నాన్నా! అప్పులు మెల్లగా తీరతాయి. ఈ సంబంధం ఖాయపరుచు!' అని చెబుదామనుకున్నాడు—కానీ, అసలు అమ్మాయికి తను నచ్చలేదనే వార్త విన్నాడు!

అప్పుడు రామం తనని అద్దంలో చూసుకున్నాడు, నల్లని చర్మం, లోతుకుపోయిన దవడలు, తెల్లబడిపోతున్న వెంట్రుకలు!

తనింతగా వల్లబడిపోయాడా?

ఈ నాలుగేళ్ళ కాలంలో తను చెల్లెళ్ళ పెళ్ళి సంబంధాలు చూడడంలోనూ, అప్పులు చేయడంలోనూ, పెళ్ళిళ్ళు చేయడంలోనూ, తర్వాత బావమరదుల గొడవలు, కయ్యాలవల్ల అశాంతిగా గడపడంలోనూ, అప్పులు ఎలా తీరుతాయా అన్న ఆలోచనలోనూ, తన శరీరంలో ఎంత మార్పు వచ్చిందో గ్రహించాడు. 'తను నిజంగా అంనవిహీను డయ్యాడు, తన నెవ్వరూ ఇష్టపడి చేసుకోరు అనిపించింది.

అప్పుడప్పుడు మాత్రమే జ్ఞాపకమొచ్చే రేఖ ఆ సమయంలో తప్పనిసరిగా జ్ఞాపకమొచ్చింది, అతనిలో ఆశారేఖ పొడసూపింది.

'అవును. రేఖకి తనంటే ఏంతో ఇష్టం. ఆ అమ్మాయికి ఇంకా పెళ్ళి కాలేదని నెల రోజుల క్రితమే సుబ్బారావు ఉత్తరం రాశాడు. ఇక తను ఏ సంబంధం చూడలేదు. అందమైన అమ్మాయి దొరికి నప్పటికిని, తనంటే ఇష్టపడి చేసుకొనే అమ్మాయి దొరకదు.

'వెంటనే బయలుదేరి వెళ్ళాలి—ఎవరికీ తెలియకుండా రేఖని పెళ్ళిచేసుకోవాలి, ఇక ధైర్యం చేయాలి, తప్పదు! తన చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు అయిపోయాయి. ఇక తను ఏం చేసినా ఎవరికీ నష్టం వుండదు.'

'రేఖగూడా సంతోష పడుతుంది. జానకి రామయ్యగారి ఆత్మ శాంతిస్తుంది. ఓ మంచి పనిచేశాననే తృప్తి తనకీ వుంటుంది' అనుకున్నాడు.

*         *         *

రామం రిక్షా దిగి సూట్‌కేస్ చేత పుచ్చుకొని గేటులోంచి జానకిరామయ్య ఇంట్లోకి వెళ్ళాడు.

గుమ్మంలో ఎదురుగుండా రేఖ కనిపించింది.

'అబ్బ! రేఖ ఎంత అందంగా వుందిప్పుడు' అనుకుంటూ గుమ్మందగ్గర ఆగాడు.

రేఖ నవ్వింది. 'రండి! ఎంతోకాలానికి వచ్చారు. మీరు మళ్ళా వస్తారనుకోలేదు. జ్ఞాపకమున్నా నన్నుమాట ... రండి! కూర్చోండి!' అంటూ లోపలికెళ్ళింది.

ఆమె మాట్లాడుతున్నప్పుడు ఆమె కళ్ళలోని నీళ్ళను గమనించాడు. 'అవి ఆనంద బాష్పాలు కావూ! తనంటే రేఖకి ఇంకా ఎంత ప్రేమ!' రామం గర్వపడ్డాడు. లోపలికెళ్ళి కూర్చున్నాడు.

'వీరు మావారు ... వీరు రామం...' అంది రేఖ తన భర్తని పరిచయంచేస్తూ.

'నమస్కారం' అన్నాడతను.

'నమస్కారం' అస్పష్టంగా అన్నాడు.

'మీ గురించి రేఖ అప్పుడప్పుడూ చెపుతూ వుంటుంది—' అతను మాట్లాడుతున్నాడు.

కానీ, రామానికి ఏమీ వినిపించడం లేదు. ●






**జ రి గి న క థ**

రామ్మూర్తికి ఇద్దరు కొడుకులూ, ఒక కుమార్తె. పెద్దవాడు ప్రసాద్ ఉద్యోగం చేస్తున్నాడు. రెండవ వాడు కొంచెం అల్లరిచిల్లరగా తిరుగుతుంటాడు. కుమార్తె లక్ష్మికి పెళ్ళికి ఎదిగి వుంది. భార్య శాంతమ్మ రోగిష్టిది. కాంచన ప్రసాద్ ఆఫీసులోనే పని చేస్తున్నది. ప్రసాద్ కాంచనా ప్రేమలో పడ్డారు. అందుచేత తండ్రి తెచ్చిన సంబంధానికి ప్రసాద్ ఇష్ట పడలేదు. ప్రసాద్, కాంచనలు మరింత దగ్గరయ్యారు. పెళ్ళి చేసేసుకున్నారు. ప్రసాద్‌కి పిల్లనివ్వాలను కున్న సత్యనారాయణకిది చాలా బాధ కలిగింది. రామ్మూర్తిని అపార్థం చేసుకున్నాడు. ఆలస్యంగా వచ్చాడన్న సాకుతో అతన్ని ఉద్యోగంలోనుంచి తీసేశాడు. లక్ష్మికి సంబంధాలు చూస్తున్నారు. పెద్ద కొడుకు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది.

# 7

గురువారంనాడు ప్రసాద్, కాంచనా ఉదయమే ఆఫీసుకు వెళ్ళిపోయారు. ఉదయం పది గంటలు అయినప్పటికీ రాజు తన లాడ్జినుంచి తిరిగి రాలేదు. రామ్మూర్తి చిట్‌ఫండు కంపెనీ ఆఫీసులో ఆ ఉదయానికి సెలవు తీసికొని యింటివద్దనే ఉండిపోయాడు.

శాంత తనకు తోచిన విధంగా లక్ష్మిని అలంకరించింది. స్వతహాగానే అందంగా ఉండే లక్ష్మి ఆ అలంకరణతో మరింత అందంగా కన్పించింది.

పదకొండు గంటలు అయిన తరువాత శివరావు, అతని భార్య పెళ్ళివారిని వెంట పెట్టుకొని రామ్మూర్తి యింటికి వచ్చారు. పెళ్ళికొడుకుతోపాటు అతని తల్లితండులే కాకుండా, పినతండ్రి శేషాచలం కూడా వచ్చాడు.

రామ్మూర్తి వారిని అందరినీ తగినట్లుగా గౌరవించాడు.

తరువాత శాంత అక్కడకు లక్ష్మిని తీసికొని వచ్చింది. లక్ష్మిని చూడగానే, పెళ్లికొడుకు ముఖంలో ఉత్సాహం కొట్టు వచ్చినట్లుగా కన్పించింది. శాంత ప్రత్యేకంగా ఆ విషయాన్ని గమనించింది. అది ఆమెకు యెంతో సంతోషాన్ని కలిగించింది.

తరువాత శివరావే లక్ష్మిని యేవో రెండు మూడు ప్రశ్నలు అడిగాడు. లక్ష్మి ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పింది వచ్చినవారికి అందరికీ లక్ష్మి అంగీకారయోగ్యంగా కన్పించింది.

'మీ పెద్ద అబ్బాయి, కోడలు కన్పించలేదు. ఎక్కడకు వెళ్ళారు?' అని రామ్మూర్తిని ప్రశ్నించాడు వెంకటావు.

'ఆఫీసుకు వెళ్ళారు. ఈ సమయంలో యింటివద్దనే ఉండాలని యెంతో ప్రయత్నం చేశారు కాని యేవో అర్జెంటు పనులు ఉండడంవలన ఆఫీసుకు వెళ్ళక తప్పలేదు' అని సర్దుబాటుగా సమాధానం చెప్పాడు రామ్మూర్తి.

'సరే, మేం సెలవు తీసికొంటాం' అని శివరావు వగైరాలు అక్కడనుంచి లేచారు.

వారిని సాగనంపడానికి రామ్మూర్తి వీధి గుమ్మంవరకు వెళ్ళాడు.

'సాయంత్రం ఆరున్నరా, యేడు గంటలకు మీరు యింటివద్దనే ఉంటారు కదా?' అన్నాడు శేషాచలం సాభిప్రాయంగా.

'చెప్పలేనండి! వచ్చే సోమవారంనాడు చీటి పాట ఉంది. అందుచేత కలెక్షను నిమిత్తం చాలా చోట్లకు వెళ్ళవలసి ఉంది' అన్నాడు రామ్మూర్తి. మళ్ళా వెంటనే 'సాయంత్రం యెందుకు లెండి! రాత్రి యెనిమిదిన్నరకు నేనే మీవద్దకు వస్తాను' అని అతను అన్నాడు.

'అయితే, అలాగే చేయండి! రాత్రి ఎనిమిదిన్నరకు మా యింటికే రండి.' అన్నాడు శివరావు

వెంకటావు రామ్మూర్తితో మరొకసారి 'సెలవు' అని చెప్పిన తరువాత వాళ్లందరూ అక్కడనుంచి వెళ్ళిపోయారు.

రామ్మూర్తి చెప్పిన ప్రకారం ఆ రాత్రి యెనిమిదిన్నరకు శివరావు యింటికి వెళ్ళాడు. ఆ సాయంత్రం రైలుకే వెంకటావు కుటుంబం వెళ్లిపోయింది. రామ్మూర్తితో మాట్లాడే నిమిత్తం వెంకటావు తమ్ముడు శేషాచలం శివరావు యింటివద్ద ఉండి పోయాడు.

*   *   *

'ఇంతకూ మీ అమ్మాయి అదృష్టవంతురాలు. నాకూ మాటదక్క యోగం ఉంది' అన్నాడు శివరావు రామ్మూర్తి రాగానే.

శివరావు అంటున్నది యేమిటో రామ్మూర్తికి అర్థం కాలేదు. అందుచేత అతను శివరావు ముఖంలోకి ఒకసారి, శేషాచలం ముఖంలోకి ఒకసారి ఆశ్చర్యంగా చూశాడు.

అప్పుడు శేషాచలమే యిలాగ అన్నాడు: 'మా బావగారు మీ సంబంధం గురించి రాసిన ఉత్తరం మా అన్నగారికి చేరిన వెంటనే యింకో సంబంధం కూడా వచ్చింది. అబ్బాయి యం బీ, బి యస్ పూర్తి చేయడానికి కావలసిన డబ్బు యివ్వడమే కాకుండా, యింకా పై చదువు నిమిత్తం వారు డబ్బు యిచ్చి ఫారిన్ కూడా పంపిస్తామని చెప్పారు. కాని మా అన్నగారు చాలా పట్టుదలమనిషి. తాను చెప్పిన మాటకు తాను యెప్పుడూ కట్టుబడి ఉంటాడు అలాగే యెదుటివారు కూడా ఉండాలని ఆయన అభిప్రాయం. అందుచేత మా అన్నగారు ఆ సంబంధం వారితో యిలాగ అన్నారు. 'మీరు రావడానికి కొంచెం ముందుగానే మా బావగారు శివరావుగారు యింకో సంబంధం గురించి ఉత్తరం రాశారు. అందుచేత ముందుగా మేము ఆ సంబంధాన్ని చూడవలసి ఉంది. ఏ కారణం చేతనైనా ఆ సంబంధం కుదరకపోతే, అప్పుడు మీ సంబంధం గురించి ఆలోచిస్తాము' అని మా అన్నగారు స్పష్టంగా చెప్పారు. ఉత్తరం చేరడం కొంచెం ఆలస్యం అయితే, మా బావగారి ప్రయత్నం అంతా వ్యర్థమైపోయి ఉండేది'

'పెళ్ళికూడా యిలాగే జరిగిపోతే నాకూ మాట దక్కుతుంది' అన్నాడు శివరావు.

'అంతా మీ అభిమానం' అన్నాడు రామ్మూర్తి.

'లక్ష్మిని వివాహం చేసుకోవడానికి వెంకట్రావుగారి అబ్బాయి అంగీకరించాడు' అనే విషయం ఆ మాటలు వినగానే రామ్మూర్తికి అర్థం అయింది. దాంతో అతనికి ఒక పెద్ద బరువు దించినట్లు అయింది.

'మీ అమ్మాయిని పెళ్ళి చేసికొనడనికి మా బావగారి అబ్బాయి అంగీకరించాడు. మీ సాంప్రదాయం అంతా తెల్సుకొన్న తరువాత మా బావగారు కూడా మీ సంబంధం చేసికొనడానికి యిష్టపడ్డారు ఇక వారి తరఫున యే అభ్యంతరమూ లేదు. కాబట్టి మీరే డబ్బు విషయం యిప్పుడు తేల్చవలసి ఉంది' అన్నాడు శివరావు.

'డబ్బు విషయం ప్రత్యేకంగా యిప్పుడు తేల్చడం యేముంది? ఆ అబ్బాయి చదువు పూర్తి చేయడానికి కావలసిన మూడు వేల రూపాయలు నేను యిస్తానని యిదివరకే చెప్పాను కదండీ!' అన్నాడు రామ్మూర్తి.

'డబ్బు యెప్పుడో యిస్తానంటే కాదు. సోమవారంనాడు అబ్బాయి కాలేజి ఫీజు వగైరా కట్టవలసి ఉంది. అందుచేత యెల్లుండి శనివారంనాడు మీరు ఆ మూడు వేలరూపాయలు యివ్వవలసి ఉంది.'

'ఎల్లుండా?' అని ఆశ్చర్యపోయాడు రామ్మూర్తి.

'అవును ఎల్లుండే సోమవారం నాడు కాలేజీఫీజు వగైరా కట్టవలసి ఉంది'




అన్నాడు శేషాచలం.

'రెండురోజుల్లో నాలాంటి వానికి అంత డబ్బు యెలాగ వస్తుంది? చెప్పండి! మా కుటుంబ పరిస్థితి అంతా శివరావుగారికి తెలుసును. నాకు ఒకవారం, పదిరోజులు పాటు గడువు యిస్తే ఆ డబ్బు సర్దుబాటు చేయగలను' అన్నాడు రామ్మూర్తి ప్రతిమాలుతున్న ధోరణిలో.

'రామ్మూర్తి చెబుతున్నదాంట్లో అసత్యం యేమీలేదు' అన్న విషయం శివరావుకు, శేషాచలానికి కూడా తెలుసును. అందుచేత వాళ్ళు వెంటనే యేమీ సమాధానం చెప్ప లేకపోయారు.

'మీరు చెపుతున్నది నిజమే అనుకోండి' కాని అవతల మా బావగారి పరిస్థితికూడా ఆలోచించాలి కదా' అన్నాడు శివరావు.

'ఈ డబ్బు యిచ్చేవాళ్ళు యెవరూ దొరకనందువలన మేము మీ సంబంధం అంగీకరించామని మీరు అనుకోవద్దు. నేను యిప్పుడు 'ఊ' అంటే చాలు, యెంత డబ్బు కావాలిస్తే, అంతడబ్బు యిచ్చేవాళ్ళు చాలామంది ఉన్నారు.

'అబ్బెబ్బే! నేను యెప్పుడూ అలాగ అనుకోలేదు. మీ బావగారి మాటమీద మీకుగల గౌరవంవల్లనే మీరు మా సంబంధాన్ని అంగీకరించారు, అని నేను మొదటి నుంచీ అనుకొంటున్నాను' అన్నాడు రామ్మూర్తి క్షమాపణ చెప్పుకొంటున్న ధోరణిలో.

'ఎలాగా, సోమవారంనాడు కాలేజీ ఫీజు కట్టాలి కదా! అందుచేత మీరు శనివారం నాడు డబ్బు యివ్వకపోతే, ఆదివారంనాడు యివ్వండి. ఆ రెండురోజుల్లో యెప్పుడు

డబ్బు యిచ్చినా ఒకటేకదా!' అన్నాడు శివరావు.

'శివరావుగారూ! శనివారం సాయంత్రానికి లేని డబ్బు ఆదివారంనాడు మాత్రం వస్తుందా? ఆదివారంనాడు బ్యాంకులకు సెలవుకదా! అందుచేత యింకొక్కరోజు గడువు యిప్పించండి. సోమవారం సాయంత్రానికి నేను యేదో ఒకవిధంగా డబ్బు సమకూరుస్తాను.'

'ఏమిటి చేద్దాం?' అన్నట్టుగా శివరావు శేషాచలంవైపు చూశాడు.

'సరే, మీరు అంతగా చెబుతున్నారు కాబట్టి అలాగే చెయ్యండి సోమవారంనాడు ఫీజు చెల్లించకపోతే, మంగళవారంనాడు 'ఫైను'తోసహా చెల్లించవలసి ఉంటుంది. ఒకరోజు ఆలస్యానికి అంత ఖర్చు యేమీ లేదు' అన్నాడు శేషాచలం.

'చాలా సంతోషం' అన్నాడు రామ్మూర్తి. ఎన్నో రోజులుగా చీకటికొట్లో ఉండిపోయిన వ్యక్తి వెలుతురులోనికి వచ్చినట్టుగా అతనికి అనిపించింది.

'మీరు యిప్పుడు 'ఊ' కొట్టి సోమవారంనాడు డబ్బు యివ్వకపోతే మా అన్నగారికి సమాధానం చెప్పడం కష్టం. ఆయన చాలా పట్టుదలగల మనిషి. ఆయనతో వ్యవహారం అన్నమాట ప్రకారం జరగవలసిందే' అని రామ్మూర్తిని హెచ్చరించాడు శేషాచలం.

'తప్పకుండా సోమవారం సాయంత్రానికి మీకు డబ్బు యిస్తాను' అన్నాడు రామ్మూర్తి.

'నేను రేపు ఉదయం మా ఊరు వెళ్ళిపోయి, సోమవారం మధ్యాహ్నం తిరిగి వస్తాను. సోమవారంనాడు సాయంత్రం ఆరుగంటలకు నేనూ, మా బావగారు కలిసి మీ యింటికి వస్తాము. మీరు అప్పుడు డబ్బు యిస్తే, నేను ఆ సాయంత్రమే యేడు గంటల బండిలో యిక్కడనుంచి తిన్నగా అబ్బాయివద్దకే వెడతాను. మంగళవారంనాడు అబ్బాయి కాలేజికి వెళ్ళే సమయానికి డబ్బు అతనికి యివ్వాలి' అన్నాడు శేషాచలం.

'అలాగేనండి' అన్నాడు రామ్మూర్తి.

'తరువాత పెళ్ళిమాటా ఈ సంవత్సరంలో మీకు యెప్పుడు కుదిరితే అప్పుడు చేయవచ్చును. దానికి మా బావగారి అభ్యం

తరం యేమీ లేదు' అన్నాడు శివరావు.

'అలాగేనండి నేను సెలవు తీసి కొంటాను' అని రామ్మూర్తి వారితో చెప్పి యింటికి వెళ్ళాడు.

శివరావు యింటివద్ద జరిగిన సంభాషణ నంతటిని రామ్మూర్తి శాంతకు చెప్పాడు. ఆ సంబంధం కుదిరినందుకు శాంత చాలా సంతోషించింది.

రామ్మూర్తికి ఒక సమస్య తీరింది కాని అంతకంటే గడ్డు సమస్య యిప్పుడు అతనికి యెదురైంది. వచ్చే సోమవారం నాటికి అనగా నాలుగురోజుల్లో అతను

# అనగనగా...

మూడువేలరూపాయలు వెంకట్రావుకు యివ్వ వలసి వచ్చింది.

'తనవద్ద అప్పుడు పట్టుమని వంద రూపాయలుకూడా లేవు. ఆ పరిస్థితిలో డబ్బు కావాలంటే యిల్లు తనఖాపెట్టడం ఒక్కటేదారి. ఇంటి తనఖామీద యెవరు డబ్బు యిస్తారా?' అని రామ్మూర్తి ఆలోచించడం ప్రారంభించాడు.

మర్నాటి ఉదయంనుంచి రామ్మూర్తి తన యిల్లు తనఖాపెట్టుకొని డబ్బు యిమ్మనమని చాలామందిని అడిగాడు.

'వెంటనే యివ్వడానికి తమవద్ద డబ్బు లేదు' అని కొంతమంది, 'వచ్చేనెలలో అయితే ఆలోచిస్తా'మని మరికొంతమంది సమాధానం యిచ్చారు.

శుక్రవారం, శనివారం రెండురోజులూ రామ్మూర్తి యెంత ప్రయత్నం చేసినా, అతనికి డబ్బు యిచ్చేవారు యెవరూ కన్పించలేదు. ఒక్కోగంట గడుస్తున్న కొద్దీ అతనికి దిగులు యెక్కువ అవడం ప్రారంభించింది.

శనివారం రాత్రి రామ్మూర్తి కుంటు కుంటూ విచారంగా యింటికి చేరాడు. 'ఎక్కడా డబ్బు దొరకలేదు' అనే విషయం రామ్మూర్తిని చూడగానే శాంతకు బోధ పడిపోయింది. అందుచేత ఆమె రామ్మూర్తిని యేమీ ప్రశ్నించలేదు. రామ్మూర్తి కూడా యేమీ మాట్లాడలేదు.

ఆ రాత్రి రామ్మూర్తికి భోజనం కూడా సహించలేదు. ఎలాగో అతను భోజనం పూర్తిచేసి మంచం మీదకు వెళ్లాడు కాని అతనికి నిద్ర పట్టలేదు.

'ఇంక రెండు రోజుల్లో తను మూడు వేలరూపాయలు వెంకట్రావుగారికి యివ్వాలి. అలాగ తను యివ్వలేకపోయినట్లయితే యీ సంబంధం కూడా తేలిపోతుంది. అది తనకు యెంత అవమానం? తన అవమానం మాట యెలాగ ఉన్నా, తరువాత మాత్రం లక్ష్మి పెళ్ళి యెలాగ జరుగుతుంది?' ఈ సమస్యలు రామ్మూర్తిని బాధించడం ప్రారంభించాయి.

ఈ పరిస్థితిలో అప్పుకోసం షావుకారు రాజయ్య వద్దకు వెళ్ళడం ఒకటే దారి అన్నట్లు రామ్మూర్తికి అనిపించింది. షావుకారు రాజయ్యను రామ్మూర్తికి బాగా తెలుసును.

షావుకారు రాజయ్యవద్ద అప్పు తీసుకోవడానికి రామ్మూర్తి మొదట భయపడ్డాడు. నిజం చెప్పాలంటే అతనివద్ద అప్పు తీసుకోవడానికి రామ్మూర్తే కాదు; ఆ ఊళ్లో యెవరైనా భయపడతారు.

తను యిచ్చిన అప్పు మీద యెక్కువ వడ్డీ పుచ్చుకోవడమే కాకుండా, అప్పు పుచ్చుకున్నవారిని యేదో ఒక విధంగా బాధించడం, వారిని అనవసరంగా కోర్టుకు యీడ్వడం షావుకారు రాజయ్యకు సరదా. ఎవరివద్దనైనా అప్పు దొరికేటట్లయితే తనవద్దకు యెవరూ అప్పుకు రారని, తాను విధించే షరతులు అన్నిటికి అంగీకరించే వారే తనవద్దకు అప్పు నిమిత్తం వస్తారని రాజయ్యకు బాగా తెలుసును.

ఈ విషయాలు అన్నీ రామ్మూర్తికి బాగా తెలిసినప్పటికీ, ఆ పరిస్థితిలో అంతకంటె మరొక మార్గం యేదీ అతనికి కన్పించలేదు అందుచేత రామ్మూర్తి షావుకారు రాజయ్యవద్దకే అప్పు నిమిత్తం వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు

రామ్మూర్తి మూడువేలరూపాయలే అప్పు చేద్దామని మొట్టమొదట అనుకొన్నాడు కాని రాజయ్య వద్దకు అప్పు నిమిత్తం వెడదామనుకొనేసరికి అతనికి యింకో ఆలోచన వచ్చింది.

తాను యిప్పుడు పెళ్ళికొడుకు చదువు నిమిత్తం మూడువేల రూపాయలు యివ్వవలసి ఉంది. తరువాత రెండుమూడు నెలల్లో పెళ్ళి చెయ్యాలికదా! ఎంత పొదుపుగా చేసినా, పెళ్ళికి రెండువేల రూపాయలు అయినా, ఖర్చు అవుతుంది. ఆ రెండువేల రూపాయలు తనకు తరువాత యెక్కడ నుంచి వస్తాయి?

తనకు ఆ యిల్లు తప్ప వేరే ఆస్తి యేమీ లేదు. అందుచేత యిప్పుడే తనకు మొత్తం కావలసిన అయిదువేల రూపాయలు అప్పుచేయడం మంచిది' అని రామ్మూర్తి తనలో తీర్మానించుకొన్నాడు.

ఆదివారంనాడు ఉదయమే రామ్మూర్తి రాజయ్య యింటికి వెళ్లాడు. కూతురు పెళ్ళి నిమిత్తం తనకు అయిదువేల రూపాయలు కావలసి ఉందని, తన యిల్లు తనఖా వ్రాయించుకొని ఆ డబ్బు యిమ్మని రామ్మూర్తి రాజయ్యను అడిగాడు.

రాజయ్య తన వద్ద ప్రస్తుతం డబ్బు నిలవలేదనీ, ఆ యిల్లు అంత విలువ చెయ్యదనీ మొట్టమొదట యేవో సాకులు చెప్పాడు కాని రామ్మూర్తి యెంతో బతిమాలగా అతను అప్పు యివ్వడానికి అంగీకరించి తన షరతులు అన్నీ చెప్పాడు.

రాజయ్య యెన్ని షరతులు పెట్టినప్పటికీ, వాటిని అన్నిటిని అంగీకరించడానికే రామ్మూర్తి అక్కడకు వెళ్ళాడు కాబట్టి ఆ షరతుల గురించి అప్పుడు ప్రత్యేకంగా అతను ఆలోచించవలసిన అవసరం లేక పోయింది. రాజయ్య చెప్పిన షరతులు అన్నిటిని రామ్మూర్తి మరోమాట చెప్ప



# అనగనగా...

కుండా అంగీకరించాడు.

'అయితే మీ యింటి తాలూకు క్రయ చీటి వగైరా దస్తావేజులు అన్నీ యిప్పుడు నాకు యివ్వండి. నేను యీ సాయంత్రం కాని రేపు ఉదయం కాని తంఖా పత్రం రాయించి ఉంచుతాను. రేపు మధ్యాహ్నం మీరు, మీ యిద్దరు అబ్బాయిలూ వచ్చి సంతకం చేసి డబ్బుతీసికొని వెళ్ళండి' అన్నాడు రాజయ్య.

రామ్మూర్తి 'సరే' అని చెప్పి యింటికి వచ్చి, యింటి తాలూకు దస్తావేజులు అన్నీ పట్టుకొని వెళ్ళి, రాజయ్య చేతికి యిచ్చాడు.

మర్నాడు ఉదయం రామ్మూర్తి 'మీరు యిద్దరూ మధ్యాహ్నం యింటివద్ద ఉండండి. తనఖాపత్రంమీద సంతకాలు పెట్టవలసి ఉంది' అని ప్రసాదతోను రాజుతోను చెప్పాడు.

ఇద్దరూ 'సరే' అన్నారు.

రామ్మూర్తి ఉదయం మామూలుగా చిట్‌ఫండు కంపెనీ ఆఫీసుకు వెళ్ళాడు. 'తనకు ఆ మధ్యాహ్నం సెలవు కావాలి' అని అతను మేనేజరును అడిగాడు.

'మధ్యాహ్నం చీటిపాట ఉందికదా! ఎవరు డబ్బుకట్టారో, ఎవరు డబ్బుకట్టలేదో... లెఖ్ఖలు అన్నీ తేల్చవలసి ఉంది. అందుచేత మధ్యాహ్నం సెలవు యివ్వడానికి వీలులేదు. మీకు అంతగా కావాలంటే మధ్యాహ్నం ఒకగంటసేపట్లో మీ పని పూర్తిచేసుకొని ఆఫీసుకు తిరిగి రండి. సాయంత్రం మీకు అవసరం ఉంటే, త్వరగా వెళ్ళిపోవచ్చును' అన్నాడు మేనేజరు

'సరే. అలాగే చేస్తానులెండి' అన్నాడు రామ్మూర్తి.

మధ్యాహ్నం రెండుగంటలకు రామ్మూర్తి, ప్రసాద్, రాజు ముగ్గురూ వెళ్ళి, తనఖా పత్రంమీద సంతకాలు చేశారు. సంతకం చేసిన వెంటనే 'తనకు యేదోపని ఉంది' అంటూ రాజు వెళ్ళిపోయాడు.

తనఖాపత్రం రాయించడానికి అయిన ఖర్చులు అయిదువేలరూపాయల్లో తగ్గించి, మిగిలిన డబ్బు రామ్మూర్తికి యిచ్చాడు రాజయ్య.

'నేను వెంటనే చిట్‌ఫండ్ ఆఫీసుకు తిరిగి వెళ్ళిపోవాలి. ఈ డబ్బు తీసుకొని నేను తిరగడం యెందుకు? అందుచేత నువ్వు ఈ డబ్బు తీసికొనివెళ్ళి మీ అమ్మ చేతికి యియ్యి' అని రామ్మూర్తి ఆ డబ్బు అలాగే ప్రసాదుకు యిచ్చాడు.

ప్రసాద్ 'సరే' అని ఆ డబ్బు తీసికొన్నాడు నాకూ ఆఫీసులో కొంచెం పని ఉంది. ఆ పని అయిపోయిన వెంటనే యింటికివెళ్ళి అమ్మకు డబ్బు యిచ్చివేసాను' అన్నాడు.

'డబ్బు జాగ్రత్త!' అని రామూర్తి ప్రసాదును ఒకసారి హెచ్చరించి చిట్‌ఫండు ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)

# నేటి నాణ్యతకు తగ్గట్లుగా ముందుకు ఊగండి



THE
LAKSHMI
MILLS
COMPANY LIMITED
COIMBATORE

SYMBOL OF
OUTSTANDING FABRICS



# బెల్లేరినా
# వాయిల్ చీరలు

మరులు కొలుపునవి, నిత్యవాడుకకు, ఆనందమునకు, విందులకు, వింతలకు ధరించదగినవి
ఎచ్చటనైనాసరే, బెల్లీరినా యెన్ని మారులైనా ఆనందం యిస్తుంది
దిగుమతి కాబడినట్టి 90 నెంబరు మరియు 100 నెంబరు అచ్చమైన ఈజిప్టు దేశం కూంబ్‌డ్ ప్రత్తి నూలుతో తయారైనవి

VSK LMC 477 TL

అమ్మకపు ప్రతినిధుయి :

* రావ్‌కో స్వదేశీస్
158, ఒప్పనకారవీధి, కోయంబత్తూరు-1
* వెంకటేశ్ వస్త్రాలయ
40, భాష్యకారుల రోడ్డు,
ఆర్. ఎస్ పురం, కోయంబత్తూరు.

మిల్ రిటైల్ షో రూమ్ :

* 17/93, ఒప్పనకారవీధి,
కోయంబత్తూరు-1.
* 9/194, క్రాస్‌కట్, కోయంబత్తూరు 12
* 387, మెయిన్ రోడ్, కోవిల్పట్టి.
* 40, వాల్టాక్స్ రోడ్, మద్రాసు-6.

ప్రత్యేక షో రూము :

* ఎస్ పి. ఎస్. ఎస్. క్లాత్ షాప్
11-12, తూర్పుచిత్తిరైవీధి, మధురై
* పి. కె. టెక్స్‌టైల్స్
48, టి ఎం బిల్డింగ్,
తిరునల్వేలి జంక్షన్.
* లక్ష్మి క్లాత్ స్టోర్స్
298 [illegible], రాజపాళ్యం.

# సినిమా

## 'అదృష్టవంతురాలు'

అని 'సుపుత్రుడు' నాయిక లక్ష్మిని అనవచ్చు కారణం ఏమిటి అని మీరడగొచ్చు?

నటసామ్రాట్ నాగేశ్వరరావుతో మూడు చిత్రాల్లో నటించే అవకాశం, ఆమెకు లభ్యం కావడమే ఆయనతో నటించడం ఒక అదృష్టమా అని మీర ! నిజం వ్రాయక తప్పదు

హీరో అక్కినేనితో నాయికగా నటించాలన్న తాపత్రయం చాలామందికి వుంది కానీ, అదృష్టం కొందరినే వరిస్తుంది ఇప్పుడు లక్ష్మిని లక్ ప్రేమించింది

## పి. ఏ. పి. లో నాయిక మార్పు

ప్రేక్షకుల కత్యంత ప్రీతిపాత్రమైన బహు కొద్ది సంస్థలలో పి ఏ పి ఒకటి ఈ సంస్థాధినేత అనుమోలు వెంకటసుబ్బారావుకు మంచి తప్ప మరొకటి తెలియదు

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించబోయే పద మూడవ చిత్రంలో నాగేశ్వరరావు, జయలలిత నటిస్తారని పాఠకులకు తెలిపియున్నాను అనివార్య కారణాల వల్ల నాయిక విషయంలో మార్పు చెయ్యవలసి వచ్చింది జయలలిత స్థానాన్ని లక్ష్మి ఆక్రమించింది

## విజయదశమికి ప్రారంభం

పి ఏ పి నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యొక్క మొదటి పాటను, చలపతిరావు విజయదశమి పర్వదినాన, జెమినీ కోటేశ్వరరావు చేత శబ్దగ్రహణం చేయించారు కొసరాజు వ్రాసిన పాటను ఎస్ పి బాలసుబ్రమణ్యం పాడారు చిత్రం ప్రారంభంలో వినిపించే పాట యిది

పై చిత్రానికి బాలమురుగన్ కథను, భమిడి పాటి మాటలను వ్రాశారు ప్రత్యగాత్మ యీ చిత్రానికి దర్శకుడు ఛాయను సెల్వరాజ్, సంగీతాన్ని చలపతిరావు నిర్వహిస్తారు నాయకీ, నాయకులుగా లక్ష్మి, నాగేశ్వరరావు నటించగా, యితర పాత్రలను రాజబాబు, రమాప్రభ పోషిస్తారు నవయుగ విడుదల

## తీరిన కోరిక !

'అక్కినేనిగారికి పాట పాడాలి, అది అందరి మెప్పు బడయాలి — యిది తీరని కోరికగా వుండిపోతుందేమో' అనుకునేవాడు, ఎస్ పి బి అతని ఆశ యీడేరింది పి ఏ పి ద్వారా ఆ కొరత తీరింది విన్నవాళ్లు పాట చాలా బాగుంది అని ప్రశంసించడం కూడా జరిగింది

## స్త్రీ !

పూర్ణా మూవీస్ నిర్మిస్తున్న సందేశాత్మక చిత్రానికి 'స్త్రీ' అనిపేరు పెట్టారు ప్రముఖ దర్శకుడు ప్రత్యగాత్మ కథ, సినిమా అనుకరణ దర్శకత్వాన్ని నిర్వహించారు చంద్రకళ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వున్న యీచిత్రంలో కృష్ణంరాజు నాయకుడు అట్లూరి పూర్ణచంద్రరావు, శేఖర్ తయారు చేసిన యీ చిత్రానికి శ్రీ ఫిలింస్ పంపిణీ దారులు

## జయభాదురి ఒక లెక్కా !

'అన్న అభిప్రాయాన్ని యేర్పరుస్తుంది, 'స్త్రీ' కథానాయిక చంద్రకళ 'గుడ్డి'లో జయభాదురి కన్నా చిలిపిగా, చిన్నగా, అందంగా యీచిత్రంలో చంద్రకళ శోభిల్లింది ముఖ్యంగా 'ఘంయవ్ రుపీస్ ఫాదర్' అని తన తండ్రి దగ్గిర కొంటెగా తుంటరిగా అడిగే ఘట్టంలో చంద్రకళ పాత్ర పోషణ అద్భుతంగా వుంది తల్లికి, కుమార్తెకు వున్న విరోధ మనస్తత్వాన్ని, విశిష్టమైన నటనా చాతుర్యంతో మెప్పించింది

'అబ్బే, చంద్రకళ తల్లి పాత్ర నేం చేస్తుంది' అన్న పెద్దమనుష్యులు ఎంత బాగా చేసింది, మరో కరయితే యింత బాగా వుండేదేనా!' అని పొగిడే విధంగా చంద్రకళ ద్విపాత్రాభినయం అమరింది

## మంచికి దీవెనలు

ఎడిటరు కృష్ణ దర్శకత్వం నిర్వహిస్తున్న శ్రీ బాలాజీ చిత్రవారి ప్రొడక్షన్ నెం 1' షూటింగు విజయదశమి రోజున వాహినీలో ప్రారంభమైంది లక్ష్మి ఫిలింస్ శివరామకృష్ణయ్య స్విచ్ఆన్ చెయ్యగా సంగీత దర్శకుడు కె వి మహదేవన్ క్లాప్‌బాయ్‌గా వ్యవహరించారు

ఆనాటి ప్రారంభ వుత్సవానికి వెండితెర అతిరథ మహారథులు విచ్చేసి, ఎడిటరు, డైరెక్టరు కృష్ణకు శుభాశీస్సులను పలికారు మంచివారికి ఎందరి దీవెనలు లభ్యమవుతాయో, కళ్ళారా చూడగలిగాను

## శోభన్ కి నాగిరెడ్డి ఆశీర్వాదం

శ్రీ బాలాజీచిత్ర కథానాయకుడు శోభన్ బాబును ప్రముఖ నిర్మాత, స్టుడియో అధినేత బి నాగిరెడ్డిగారు తనకు వేసిన పూలమాలను శోభన్ మెడలో వేసి, శుభాకాంక్షలను తెలిపారు శోభన్ కళ్ళు ఆనందబాష్పాలతో చెమ్మగిల్లాయి

పై చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచనను, మహదేవన్ సంగీతాన్ని, రామకృష్ణారావు ఛాయను, రామమోహనరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు ప్రధాన పాత్రలను 'షావుకారు' జానకి, వాణిశ్రీ, జగ్గయ్య, గుమ్మడి, సత్యనారాయణ, పద్మనాభం పోషిస్తున్నారు

'నా అభివృద్ధిని కాంక్షించే మిత్రులు కొందరు యీ సంస్థను స్థాపించి, నాకు ఒక మంచి చిత్రాన్ని నిర్మించే అవకాశాన్ని కలిగించారు' అన్నారు దర్శకుడు కృష్ణ



'నేను-నా దేశం'లో విజయనిర్మల, రామకృష్ణ

# రామ, రావణాసుర పాత్రల్లో ఎన్. టి. రామారావు

రామారావు ధరించిన పౌరాణిక పాత్రలను వీక్షించినప్పుడు, ఆ పురాణ నాయకులు యిలా వుండేవారేమో అన్న భావం ద్యోతకమవుతుంది అలాంటి పాత్రలను చేపట్టు వేళ, ఎన్టీరామారావు పాటించే దీక్షాదక్షతలు, నియమ నిబంధనలు అనితర సాధ్యములు రామాయణ, భారతాలలో ఆయన మిగిల్చిన దేమున్నది? ఆ కథాపాత్రలో ప్రాణ ప్రతిష్ఠ సలిపి, ప్రజల చేత, పండితుల చేత 'అన్యు లెవరికి సాధ్యము నీ చందంబు చెయ్య' అని పొగడ్తలు అందుకుని యున్నారు

దశరథ తనయుడు, సూర్య వంశోద్భవుడు అయిన శ్రీరాముడిగా, లంకేశ్వరుడు, సకల శాస్త్ర పారంగతుడు అయిన రావణాసురుడిగా నందమూరి తారకరామారావు ద్విపాత్రాభినయం చెయ్యడానికి వుపక్రమించారు విభిన్న, వైరుధ్య మానసిక దృక్పథాలు గొన్న యీ రెండు పాత్రలను ఎన్టీ ఆర్ లోగడ ధరించి, మెప్పించిన విషయం పాఠకులకు, తెలుసు



నటి జమున

( చిత్రకారుడు శ్రీ దువ్వూరి నాగేశ్వరరావు )

ఆయనే దర్శకత్వం, కథా సంవిధానము నిర్వహించు 'శ్రీరామ పట్టాభిషేకం' చిత్రాన్ని యుగ యుగాలు ప్రశంసించు రీతి, నిర్మించదలిచారు రామారావును దైవాంశసంభూతుడు అని చెప్పడం అతిశయోక్తి కాదు

# డి. వి. ఎస్. కి కథ వో. కే.

గత సంవత్సరం విడుదలయిన మంచిచిత్రాల లిస్టులో డి వి ఎస్ ప్రొడక్షన్స్ వారి 'చిన్ననాటి స్నేహితులు' చిత్రం ఒకటి

చక్కటి కథ దొరికే వరకు నిర్మాణం జోలికి పోరు, నిర్మాత డి వి ఎస్ రాజు దొరికిన మంచి కథను, ప్రజలకు కావలసిన హంగామాలతో నిర్మిస్తారు అందుకే డి వి ఎస్ రాజుగారి చిత్రాలన్నీ ప్రజాదరణను పొందాయి

ఇప్పుడు ఆయనకు మరొక కథ లభిం... కథ హీరో రామారావుకు నచ్చింది ఆయన ...కే చేశారు ఒతిత్వరలో షూటింగు ప్రారంభమవుతుంది



'కాలం మారింది'లో శారద, శోభన్‌బాబు

## డిశంబరు నుండి విఠలాచార్య చిత్రం

'జానపద బ్రహ్మ' అని అనిపించుకున్న విఠలాచార్య తనకు లాభాలను తెచ్చిపెట్టిన అలాంటి కథనే ఎన్నుకున్నారు అంటే జానపదం అన్నమాట కథను జి కె మూర్తి వ్రాశారు డిశంబరు నుండి షూటింగు ప్రారంభమవుతుంది నాయక పాత్రను ఎన్టీరామారావు పోషించడానికి అంగీకరించారు

విఠలాచార్యకి హిందీ ఆఫర్ ఒకటి వచ్చింది అదికూడా జానపదమే 'బహుశా అంగీకరించవచ్చు' అని, ఆయనే చెప్పారు

## కుమారుడి కోసం

విఠలాచార్య కుమారుడు శ్రీనివాస్ కూడా దర్శకుడే గదా! తన కుమారుడికి రెండు కార్లు, కొంత డబ్బు మూలధనంగా యిచ్చి, అతని చేత మరొక సంస్థను ప్రారంభించదలిచారు విఠలాచార్య ఆయన ఒక సాంఘికాన్ని తయారు చేస్తారు

## కృష్ణకిశోర్ ప్రొడక్షన్స్!

కొత్తగా వెలసిన మరొక సంస్థ స్థాపించిన వారు జోతి నారాయణరావు కుమారుడు శేఖర్‌బాబు.

కథను నిర్మాత వ్రాయగా, మాటలను పినిసెట్టి రచించారు దర్శకత్వాన్ని పి చంద్రశేఖరరెడ్డి, సంగీతాన్ని కె వి మహదేవన్ నిర్వహిస్తున్నారు

అక్టోబరు 24న షూటింగు ప్రారంభం నాయకీ, నాయకులుగా జమున, కృష్ణ నటిస్తున్నారు ముఖ్యపాత్రలను కృష్ణంరాజు, చంద్రమోహన్, సూర్యకాంతం, రమాప్రభ, హేమలత ధరిస్తారు జోతి విడుదల

## డాక్టర్ కృష్ణ హౌస్‌సర్జన్ జమున

పై చిత్రంలో డాక్టరుగా కృష్ణ, హౌస్ సర్జనుగా జమున కనిపిస్తారు

## శ్రీ వాణీ కంబైన్స్

ఎన్ ఆర్ కంబైన్స్‌లో భాగస్వామిగా వుండి, విడిపోయిన ఎన్ వి సుబ్బరాజు స్థాపించిన సంస్థ యిది కథను నిర్మాతే వ్రాశారు మాటలను దాసరి నారాయణరావు రచించారు

## కృష్ణ—జమున—రెడ్డి!

ఈ చిత్రంలో [illegible] జమున ప్రధాన పాత్రధారులు పి చంద్రశేఖరరెడ్డి దర్శకుడు

మిగతా భూమికలను కృష్ణంరాజు, సత్యనారాయణ ధరిస్తారు. అన్నపూర్ణా విడుదల.

శ్రీ వాణీకంబైన్స్ సంస్థను నెలకొల్పిన సుబ్బ రాజుకు సాహిత్యంలో, కథా రచనలో మాంచి ప్రవేశం వుంది. చాలా కథలను వ్రాసియున్నారు. చదువుకునే రోజుల్లో, తీరిక దొరికినప్పుడల్లా గ్రంధాలయంలోకి వెళ్ళి, అనేక గ్రంధాలను తిరగేసేవారు. ఆ పఠనం యిప్పుడు ఉపయోగపడింది, చాలా మంచి కథను వ్రాశారు.

## బంగారు మనసులు

'బంగారు తల్లి'గా ఎంత పేరు నార్జించిందో, 'బంగారు మనసులు' చిత్రంలో అంతకు రెండింతలు పేరు నార్జించే విధంగా జమున నటించిందని తెలిసింది. ఆమె చెయ్యకపోతే, మరెవరు చేస్తారు? అందుకే ఇప్పటికీ ఆంధ్రుల అభిమాన నాయికగా వుంటోంది.

'బంగారు మనసులు' కథను 'సంసారం' కృష్ణమోహన్ శోభారాణి పేరిట నవలగా వ్రాసియున్నారు. అందులో ఏముంది చిత్రానికి సరిపడే సరుకు అని చాలామంది పెదవి విరిచారు. ఇప్పుడు ఆదే కథను కె. ఎస్. రెడ్డి నిర్మించారు. రషస్ చూసిన వాళ్ళు 'ఓహో, ఆహా' అంటున్నారు. ఈ చిత్రములో సత్యనారాయణ ధరిస్తున్న పాత్ర విశిష్టమైనది.

## జమున—సత్యనారాయణ !

'సిపాయికూతురు' తర్వాత జమున, సత్యనారాయణ నాయకీ, నాయకులుగా నటిస్తున్న చిత్రమే 'బంగారు మనసులు'. ఈ చిత్రంలో కృష్ణకుమారి, గెస్టు పాత్రను పోషించింది. మా. గోపీ అనే హాస్య నటుడు పరిచయం అవుతున్నాడు. రాజసులోచన ఒక ముఖ్యభూమికను ధరించింది.

## కొడుకు—కోడలు

పద్మశ్రీ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న 'కొడుకు— కోడలు' షూటింగు, కామెడీ విభాగం తప్ప) పూర్తయింది. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచయిత. సంగీతాన్ని మహదేవన్, కళను కృష్ణారావు, ఛాయను కె. ఎస్. ప్రసాద్ నిర్వహించారు.

పై చిత్రంలో ఎస్వీరంగారావు, శాంతకుమారి దంపతులుగా కనిపిస్తారు. వారి కుమారుడిగా అక్కినేని, కోడలుగా వాణిశ్రీ నటించారు. ముఖ్య పాత్రలను జగ్గయ్య, గుమ్మడి, రాజబాబు, లక్ష్మి, రమాప్రభ, నిర్మల ధరించారు. పి. పుల్లయ్య దర్శకత్వం నిర్వహించిన యీ చిత్రం శ్రీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

## సాతనూర్‌లో కృష్ణ—వాణిశ్రీ

అక్టోబరు 15, 16 తేదీల్లో, కృష్ణ, వాణిశ్రీలు సాతనూరు డామ్‌ని వీక్షించడానికి వెళ్ళారు. అక్కడకి వెళ్ళింది రవిరాజ్ ప్రొడక్షన్స్ వారి 'మహరాని తల్లి' షూటింగులో పాల్గొనడానికి.

ప్రకృతిశోభతో విలసిల్లే ఆ ప్రదేశాన్ని వీరిద్దరూ తమ స్వాధీనం చేసుకున్నారు. పరస్పర అనురాగ బంధితులైన వాణిశ్రీ, కృష్ణలు ఒక చక్కటి పాటను ఆలాపించారు. ఆ పాటను నారాయణ రెడ్డి వ్రాశారు.

'మిలమిలమెరిసే తొలకరి సొగసే ఏమంటుంది?
చల్లగా చిరు జల్లుగా అది కురవాలంటుంది'

ఈ పాట చిత్రీకరణతో షూటింగు పూర్తయింది. నవంబరు 9 న విజయా కంబైన్స్ ద్వారా విడుదలవుతుంది, అన్నారు నిర్మాత కేశన జయరాం.

పై చిత్రం రషస్ చూసిన వాళ్ళంతా దర్శకుని ప్రతిభను పదే పదే మెచ్చుకున్నారు. అతడి పేరు డి. ఎస్. ప్రకాశరావు. అతడు ఎందరో మొనగాళ్ళవద్ద శిష్యరికం చేసి యున్నాడు అది వృధాపోతుందా!



'కొడుకు—కోడలు'లో నాగేశ్వరరావు, వాణిశ్రీ

## మమతా ప్రొడక్షన్స్ కాలం మారింది

'మారేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్' అన్నది కొన్ని జీవితాలలో ఋజువు అవుతుంది. శ్రీనివాస్ పెళ్ళిచూపులలో గీతను చూచాడు. కాని దైవ నిర్ణయం వేరుగా వుండడం వల్ల ఆ చూపులు పండలేదు. ఆ గీత చెల్లి శాంతిని, ఆవిడలోని అమాయకతను చూచి ముగ్ధుడై మనసిచ్చాడు. ఆ ప్రియురాలి మోహనరూపం శ్రీనివాస్ అణువణువులో నిండి అనుక్షణం పలవరిస్తుంది. ఆ పలవరింతల పులకరింతలలో పరవశించి మంచి తియ్యని లోకంలో తన ప్రియురాల్ని కలుసుకున్నాడు.

శ్రీనివాస్: తొలకరి మెరుపులా
తొలివాన చినుకులా
ఈ వేళ వచ్చావు— ఎవరికోసం?
శాంతి: ఇంకెవరికోసం?
శ్రీనివాస్: ఊ! ఏమేమి తెచ్చావు ఈ బావకోసం?
శాంతి: సన్నజాజీ సొగసుంది
జున్నులాంటి వయసుంది
నిన్ను చూస్తే కరిగి పోయే
వెన్నలాంటి మనసుంది!

ఇలా కలలో ప్రేమికులిద్దరూ తనువులను మరచి తన్మయంత్వలో మునిగిపోయారు.

శ్రీనివాస్‌గా శోభన్‌బాబు, శాంతిగా శారద నటించారు.

ఈ పాటను డా. సి. నారాయణరెడ్డి వ్రాయ, ఘంటసాల, సుశీల, రాజేశ్వరరావు సంగీత దర్శకత్వంలో ఆలాపించారు. ఈ చిత్రానికి నిర్మాతలు: వాశిరాజు ప్రకాశం, బొమ్మిశెట్టి హనుమంతరావు. దర్శకత్వం: కె. విశ్వనాథ్.

## సినిమా డైరీ

- త్రివేణీ ప్రొడక్షన్స్ వారి 'బడిపంతులు' నవంబరు 23 న, పూర్ణా పిక్చర్సు ద్వారా విడుదలౌతుంది. టైటిల్ పాత్రను ఎన్. టి. రామారావు పోషించారు.
- నందినీ ఫిలింస్ వారి 'ఇల్లు— ఇల్లాలు' నవంబరు 30 న కుమారస్వామి పిక్చర్సు ద్వారా విడుదలౌతుంది. కృష్ణ, వాణిశ్రీ ప్రధాన పాత్రధారులు
- పద్మశ్రీ పిక్చర్సువారి 'కొడుకు— కోడలు' వర్ణచిత్రం 14 రీళ్ళు అయింది. నాగేశ్వరరావు, వాణిశ్రీ, లక్ష్మి ముఖ్యపాత్రధారులు
- లక్ష్మి ఆర్ట్స్ 'పంజరంలో పసిపాప' 12 రీళ్ళు రెడీ అయింది. రామకృష్ణ, రాజశ్రీ, జ్యోతిలక్ష్మి ముఖ్యతారాగణం
- నాగేశ్వరరావు అంగీకరించిన కొత్త చిత్రాలు — పి. ఏ పి, చిత్రకల్పనా, విజయభట్
- రామారావు ఒప్పుకొన్న చిత్రాలు — డి వి యస్, విఠల్, తారకరామా, గౌతమి

# సినిమా

## పెద్ద కొడుకు

'కార్మికవీరుల కన్నుల నిండే . . . ఘర్మజలానికి ఘర్మజలానికి ఖరీదుకట్టే షరాబు లేడోయ్' అన్నాడు మహాకవి శ్రీశ్రీ. నిజమే. ఎండనక, వాననక, పగలనక, రేయనక, శ్రమించే శ్రామికులకు తగినంత ప్రతిఫలం ముట్టడం లేదు. కార్మిక, కర్షక సోదరులు శాంతి సౌఖ్యాలతో తులతూగిన రోజు భారతదేశం మూడు పువ్వులు, ఆరుకాయలుగా ప్రకాశిస్తోంది. ఆ విషయాన్నే శంకర్ దసరా పండుగ రోజున తన తోటివారితో కలిసి

'ఈనాడే దసరాపండగ— అన్ని వృత్తుల శ్రామిక
శక్తుల ఆయుధ పూజల పండుగ,
పొలిమేరలలో పొంచివున్న దుండగుల గుండెలు
చీల్చే కత్తికి పూజ ఈనాడే,
ఫ్యాక్టరీలలో ఇనుమును కాచి పరికరాలుగ
తీరిచి దిద్దేసుత్తికి పూజ ఈనాడే,
రాళ్లను చీల్చి, బీళ్లను దున్ని రత్నాలు పంట
పండించే నాగలి పూజ ఈనాడే,
వందలాది ఎకరాలకు ఇకపై వారసు డొకడే
వుండడులే,
కోట్లబలంతో కులికేవారికి నూకలు కూడ
పుట్టవులే.

అంటూ శంకర్ (శోభన్‌బాబు) తన బృందంతో, విప్లవాత్మక గీతాలను శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ వారి చిత్రం 'పెద్ద కొడుకు'లో పాడతాడు. ఈ చిత్రానికి నిర్మాతలు: శ్రీకాంత్ నహతా, శ్రీ కాంత్ పటేల్, దర్శకత్వం: కె. యస్. ప్రకాశరావు. సంగీతం: ఆదినారాయణరావు, అసోసియేట్ డైరక్టర్సు: రాఘవేంద్రరావు, ప్రకాశరావు, ఎడిటింగ్: యస్. పి. యస్. కృష్ణ. కళ: చలం, ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: మధుబాయ్ పటేల్. విడుదల: రాజశ్రీ.

## నో రిటైర్‌మెంట్!

ప్రముఖ హిందీనటుడు రాజేష్‌ఖన్నా 1974 లో చిత్ర పరిశ్రమకు గుడ్‌బై కొట్టగలనని కొన్ని రోజుల క్రితం పత్రికా ప్రకటన ఇచ్చి వున్నారు.

ఇప్పుడు అతను ఒప్పుకొన్న చిత్రాల సంఖ్య 28. ఇవి పూర్తి గావడానికి కనీసం నాల్గు సంవత్సరాలైనా అవుతుంది. అలాంటప్పుడు 74 లో ఆయన రిటైర్ కావడం ఎలా సాధ్యమవుతుంది ?

## యం. జి. ఆర్ తో 'దోరాహా' నాయిక

'దోరాహా' చిత్రం ద్వారా అఖిల భారత ప్రశస్తి నందుకొన్న రాధాసలూజా తమిళనటుడు యం. జి. ఆర్. తో నటించబోతూందట.

చిన్న వయస్సులో కొంతకాలం దక్షిణదేశంలో ఈవిడ నివసించినదట. అందుచేత తమిళం సరళంగా మాట్లాడ గల్గుతుంది.

## నేను డబ్బానా!

హిందీనటుడు రాజకపూర్ జేష్ఠకుమారుడే రణధీర్‌కపూర్. ఇతణ్ని 'డబ్బా' అని ముద్దుగా పిలుస్తుంటారు. దురదృష్టవశాత్తు ఇతడు నటించిన మొదటి చిత్రం ఫ్లాప్ అయింది. అప్పటి నుంచి అందరూ 'డబ్బా డబ్బా' అని పరిహసించేవారు. ఇటీవల ఇతడు నటించిన రెండు చిత్రాలు విజయాన్ని సాధించాయి. దీంతో నిర్మాతలతన్ని వెంబడిస్తున్నారు. పదిహేను చిత్రాలలో కథానాయకుడిగా 'బుక్' చేశారు. చూశారా! ఈ జగత్తు అంటున్నాడు రణధీర్‌కపూర్.

## నిర్మాతగా శారద

'మానవుడు— దానవుడు' కథానాయిక, సంచలన నటుడు చలం భార్య అయిన శారద మళయాళంలో 'పత్రదీపం' పేరిట ఒక చిత్రాన్ని నిర్మిస్తుంది.

శారద హిందీలో సంజీవకుమార్‌తో నటిస్తున్న 'అగ్నిరేఖ' చిత్రం దాదాపు పూర్తి అయింది. ఆ చిత్రం రషస్ చూసిన హిందీ నిర్మాతలు శారదను ప్రశంసావాక్యాలతో అభినందించడమేగాక తమ చిత్రాలలో నటించమని కోరారు.

## రమాప్రభ ఫైటింగ్

విధివైపరీత్యం వల్ల లేబ్రాయంలోనే వితంతువు అయిన 'విజయ' అనే అందగత్తెను అర్జు జనార్దనరావు, జగ్గారావు మానభంగం చేయడానికి సిద్ధపడుతున్న తరుణంలో హాస్యనటి రమాప్రభ ఆ దృశ్యాన్ని చూచి, రుద్రరూపం దాల్చి దుష్టులిద్దరిపై కెగబడి, ఎగిరిఎగిరి కొట్టింది. ఆడదాని దెబ్బకు తాళలేక ఇద్దరూ పలాయనం చిత్తగించారు. శభాష్, శభాష్ అంటూ కృష్ణ, వాణిశ్రీలు మెచ్చుకొన్నారు.

ఈ తతంగమంతా కె. సుబ్బిరెడ్డి సమర్పిస్తున్న 'ఇల్లు— ఇల్లాలు' చిత్రంలో కన్పిస్తుంది. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## మరి రెండు బహుమతులు

కన్నడచిత్రం 'సంస్కార'కు మరి రెండు బహుమతులు లభ్యమయ్యాయి. మన్‌హీం అంతర్జాతీయ చిత్రోత్సవంలో కాథలిక్, మరియు ప్రొటెస్టెంట్ జ్యూరీ అవార్డులు ఈ చిత్రానికి సంక్రమించాయి.

## జగపతిలో మంజుల

తెలుగు ప్రేక్షకుల ఆదర, ఆశీర్వాదాలనందుకొన్న జగపతి అధినేత వి. బి. రాజేంద్రప్రసాద్ తన నిర్మాణ చాతుర్యాన్ని, దర్శకత్వ ప్రతిభను, తమిళ ప్రేక్షకులకు చవిచూపించనున్నారు. జగపతి ఆర్ట్ పిక్చర్స్ తమిళంలో నిర్మించే మొదటి చిత్రంలో శివాజీ కథానాయకుడిగా, షావుకారు జానకి, మంజుల నాయికలుగా నటించగలరని తెలిసింది.

తెలుగులో అఖండ విజయాన్ని సాధించిన 'మానవుడు— దానవుడు' యొక్క తమిళరూపమే జగపతి రాజేంద్రప్రసాద్ నిర్మించబోయే తమిళ కథ.

- శ్రీనివాస్



'మరపురాని తల్లి'లో కృష్ణ, వాణిశ్రీ.

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు <u>బోర్న్‌విటా</u> ఇవ్వండి !

చదువుల్లో ఆటల్లో హరింపు అయే శక్తిని పిల్లలకు
తిరిగి సమకూర్చకపోతే వారి మానసిక శారీరక
వికాసానికి ఆటంకం కలుగుతుంది ప్రతి దినం వారు
బోర్న్‌విటా త్రాగటం వలన పిల్లల శక్తి పెరుగుతూ
ఉంటుంది పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్
మరియు పంచదారలతో తయారైన
బోర్న్‌విటా రుచికరమైనది.




**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా !**







## జరిగిన కథ

ఆర్థికి ఇష్టంలేకపోయినా ఎం. ఏ. లో చేరాడు విద్యార్థి. తన అన్నకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని అన్నె సంకల్పం. కాని, లక్ష్మి మరెవరినో ప్రేమిస్తున్నట్టు తెలుసుకున్న విద్యార్థి, సేవసమాజంలో నాదం పెంచుకుని తిరిగి వచ్చేస్తాడు, జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. ఇద్దరూ బాగా చనువుగా వుంటున్నారు. లక్ష్మిని ప్రేమించిన మధూని వరికి పట్టుకున్నాడు విద్యార్థి. కాని, అలాంటి మోసగాణ్ణి పెళ్ళిచేసుకోనంది లక్ష్మి. మధూకి బుద్ధి చెప్పి పంపించాడు విద్యార్థి. ఓర్మినల్ పరీక్షలు అయిపోయాక ఇంటికి వెళ్ళాడు విద్యార్థి.

## 19

వినాయుతేనెం జశ్వ మాత్రం మర్నాటి దాకా అతడి స్వాధీనంలోకి రాలేదు... జ్ఞానాంబ విషయమేమీ తెలియలేదు...పని పిల్లను పంపుదామన్నా యీ నెల రోజుల సెలవుల్లోనూ, యింటివాళ్ళు ఆ మనిషిని మానేసి, యింకో మనిషిని పెట్టుకున్నారు. ఇక విధిలేక లేచి తనే బయలుదేరాడు ఆ సాయంత్రం.

మళ్ళీ జ్ఞానాంబ గదికి తాళమే దర్శనమిచ్చింది. ఆ రోజు హోటల్కు తెరిచారు ...కాఫీ అయినా తాగుదామని అలాగే ఊహాద్చుకుంటూ హైరోడ్డు మీదకు వచ్చాడు...హోటల్లో సత్యం ఫ్రెండ్ వినయభూషణ్ కన్పించాడు.

విద్యార్థిని చూసి చూడగానే దగ్గరకు వచ్చి, 'అదేమిటి ? జ్ఞానాంబగారికి జబ్బు చేసిన యీ నెల రోజులు ఎక్కడికి వెళ్ళిపోయ్యారు మీరు?' అని అడిగాడు.

'జబ్బు చేసింది !... ఏ జ్ఞానాంబను గురించి అండీ మీరు మాట్లాడుతున్నారు?' నిశ్చేష్టుడయి పక్కనేవున్న కుర్చీలో కూలబడుతూ అడిగాడు విద్యార్థి.

'ఆవిడేనండీ ... అప్పుడు మీరు కాలికి దెబ్బ తగిలిందని తీసుకువస్తే మా దేవసహాయం దగ్గరకు తీసుకువెళ్ళాం... ఆవిడే ... పాపం చాలా జబ్బు పడ్డారు...'

'ఏమైంది వినయభూషణ్? ఆవిడకేమయింది? ... ఇప్పుడెలా వుంది?' ఆదుర్దాగా అడిగాడు విద్యార్థి...

'టైఫాయిడ్... యిరవై ఒక్కరోజులు మంచంలో వున్నారు... ఈ మధ్యనే పత్యం తీసుకున్నారు. హాస్పిటలు నుండి డిస్చార్జి కూడా చేశారు ... మా దేవసహాయం యిప్పుడు యిక్కడే జనరల్హాస్పిటల్లోనే ఎపాయింట్ అయ్యాడుగా. అతడే యీ కేసుకు అటెండ్ అయ్యాడు' అని చెప్పాడు వినయభూషణ్...

సత్యం వూరివాడే అయిన దేవసహాయం కూడా విద్యార్థికి పరిచయమే ... అతడు కూడా కష్టాల్లో పుట్టి కష్టాల్లో పెరిగినవాడు...అతడి ఓగిమి, అతడి సేవానిరతి, రోగులపట్ల అతడు చూపే శ్రద్ధ చూస్తూ, అనన్య సామాన్యమైనవి ... గవర్నమెంటు హాస్పిటల్లో రోగులను చూసి కష్టపడాలని, కసిరి కొట్టాలని అంటారు. కానీ దేవసహాయం, చివరికి పత్నిటుంతు అనాయకులకు కూడా జవాబు లిచ్చే తీరూ, అతడి సహనం, ఆత్మీయత ఒలికే అతడి ఓదార్పు మాటలు, మానవ సేవలోనే ఆనందం పొందుతున్నాడా అన్నట్లు సదా ముఖాన వెలిగే చిరునవ్వు... చూస్తే వారికి యిలాంటి వాళ్ళే వైద్యవృత్తికి కావల్సినవారు అనిపించేలా వుంటాడు ... ఎప్పుడు ఎవరికి ఏ సహాయం కావల్సి వచ్చినా యిందు గల డందులేడని సందేహము వలదన్నట్టుగా ప్రత్యక్షమౌతాడు... అతడి హాస్యదాసి కూడా మంచిది ... విద్యార్థి కూడా అతడంటే ఎనలేని గౌరవాభిమానాలు. .

'డాక్టర్ దేవసహాయం అటెండ్ అయ్యారా! ... అయితే భయంలేదన్న మాట ... వాళ్ళవాళ్ళందరూ వచ్చారా వినయభూషణ్?.:. మీకేమయినా తెలుసా?' అని అడిగాడు యింకా ఆదుర్దాగానే...

'ఆఁ... నేను రోజూ హాస్పిటల్కి వెళ్ళినప్పుడల్లా ఒకసారి చూసి వస్తుండేవాడిని. వాళ్ళ వాళ్ళు రాలేదు... ఎవ్వరూ రాలేదు .. కాని అబ్బ ... ఏం మనిషండీ! ... ఆవిడలాంటి గుండె నిబ్బరం కల మనిషిని నేను చూడలేదండీ ... ఒక్కరు చుట్టాలు రాలేదు... ఒక్కరు స్నేహితులు రాలేదు. కానీ ఒక్కరోజు కూడా ఆవిడ భయపడలేదు...మేము భయపడ్డరోజున కూడా ఆవిడ 'నాకేం భయం లేదండి. మీరు మిగతా కేసులు చూసుకోవచ్చు'నని ధైర్యం చెప్పేవారు...కానీ సత్యం దగ్గర మాత్రం మా దేవసహాయాన్ని కొన్ని పేచీ పెట్టింది గట... అన్నట్టు ఒక్క పదిరోజులపాటు ఎవరైనా కనిపెట్టి వుండాలని చెప్పాడు మా దేవసహాయం ... మందులు టానిక్కులూ వ్రాసి యిచ్చాట్ట...అని వాడమని చెప్పండి ... పత్యం కూడా జాగ్రత్తండీ' అన్నాడు. .

'మీరు చేసిన సహాయానికి చాలా థాంక్స్ వినయభూషణ్! ... నాకు ఒక కార్డు ముక్క కూడా రాయలేదండీ ఆవిడ యీ అనారోగ్యం విషయం' అన్నాడు విద్యార్థి...

'నేను చెప్పిందేముందిలెండి .. అప్పుడప్పుడు కాస్త చూశాను... దేవసహాయమే యింటికి చేర్పించాడు. మీ థాంక్స్ అతడికి 'కన్వే' చేస్తాను లెండి.' అన్నాడు వినయభూషణ్.

'వస్తా'నని చెప్పేసి పరుగులాంటి నడకతో బయటకు వచ్చాడు విద్యార్థి. సూర్యాస్త

ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి అతడి మనసులో.

అతడు రెండుసార్లు వెళ్ళినా తలుపు తాళం పెట్టేవుంది, జ్ఞానాంబ గదికి. ఇంటికేమన్నా వెళ్ళిపోయిందా?... ఒక్కతే వున్నదంటే లక్ష్మి ఏమైనట్లు? అవసరం వచ్చినప్పుడు లక్ష్మి ముఖం చాటుచేసిందా? ...లేక యిద్దరూ మాటా మాటా అనుకున్నారా?...ఇంటివాళ్ళనైనా అడిగి తెలుసుకోవాలి...ఒకవేళ వూరికి వెళ్తే అడ్రసు తెలుసుకుని వెళ్ళి చూసి రావాలి ... అనుకుంటూ తల వంచుకు నడుస్తున్నాడు విద్యార్థి.

'హల్లో విద్యార్థిగారూ!...' పరిచితంగా వున్న కంఠం విని తలెత్తి చూస్తే ఎదుట జ్ఞానాంబ వుంది...మనిషి పుల్లలా అయిపోయింది. కళ్ళు మరీ పెద్దవయి ముఖమంతా ఆక్రమించుకున్నట్లున్నాయి. రక్తం లేనందువల్ల పాలిపోయి కాబోలు మనిషి వెనుకటికంటె కొంచెం పొడుగా కన్పడుతోంది. కళ్ళక్రింద మాత్రం మరీ నల్లగా చారికలు పడ్డాయి. జుట్టు బాగా రాలిపోయింది కాబోలు సన్నగా పొడుగ్గా ఎలకతోకలా అయింది జడ...ఆ స్వరంలోకూడా చాలా మార్పు వచ్చింది. ఎప్పుడూ లేంది సన్నజరీ వున్న గంధం రంగు పట్టుచీర కట్టింది ... కాళ్ళకు పసుపు మొఖాన పెట్టిన కుంకుమ, చేతిలోవున్న రెండు పంచులు చూస్తే ఏదో పేరంటానికి వెళ్ళి వస్తున్నట్లుగా వుంది.

విద్యార్థి నోట మాట లేక చూస్తూ నిలబడ్డాడు.

'అదేమిటి విద్యార్థిగారూ ... నన్నప్పుడే మర్చిపోయ్యారా?...లేక యీ పట్టుచీర, చేతిలో తాంబూలం కవర్లు చూస్తే పలకరించ బుద్ధికాలేదా?' అంది జ్ఞానాంబ నవ్వుతూ.

'కాదు జ్ఞానాంబగారూ... నేను మీతో మాట్లాడదల్చుకోలేదు... అసలు ఎందుకు మాట్లాడాలి? ... నేను ఏమవుతాను మీకు?... ఒకప్పుడు మీకు ఆత్మీయుడ్ననుకున్నాను. కానీ యిప్పుడు తెలిసిపోయింది మీకేమీ కానని ... లేకుంటే యిరవై ఒక్క రోజులు హాస్పిటల్లోవుంటే ఒక్కరోజు నేను మీకు జ్ఞాపకం రాలేదు. నాకు తెలియచెయ్యాలని కూడా మీకనిపించలేదు. నేనేమయిపోయ్యాననుకున్నారు జ్ఞానాంబ గారూ... ఏమైపోయ్యాననుకున్నారు?...' ఆవేదన నిండిన గద్గదకంఠంతో అన్నాడు.

'ఓ అదా ... అప్పుడే ఎవరు చెప్పారు బాబూ మీకీ సంగతి?... అయినా ఏమైందని మీకీ ఖంగారు?...మనుష్యులన్నాక నలత రాక మానుతుందా?... కానీ...ఏ జబ్బులూ నన్నేమీ చెయ్యలేవు ... ఆ ధైర్యం



నాకుంది ... సాగరోన్ముఖంగా సాగిపోయ్యే నదీప్రవాహాన్ని ఎవ్వరూ ఆపలేరు... అలాగే లక్ష్యాభిముఖంగా సాగిపోయ్యే జ్ఞానాంబను కూడా ఏ రోగమూ ఏమీ చెయ్యలేదు విద్యార్థిగారూ ... ఆ విషయం నాకు తెలుసు... మీకు తెలిసిన మరుక్షణం మీరు అక్కడి పనులన్నీ వదిలేసి రెక్కలు కట్టుకు వాలుతారని తెలుసు. అందుకే మీకు తెలియపరచలేదు. కానీ మీ సత్యంగారి (ఫ్రెండ్స్) వినయభూషణ్, డాక్టరు దేవ సహాయంగార్లు, చాలా సాయం చేశారు. సునీలగారు కూడా కంటికి రెప్పలా చూసుకున్నారు.'

'ఆఖరికి లక్ష్మికూడా దగ్గర లేకపోవడానికి ఏమైంది తను?... మళ్ళీ యిల్లు మారిందా?...'

'ఛా...ఛా...లేదండీ... మీకు తెలుసుగా లక్ష్మి అంటే వాళ్ళ హెడ్మిస్ట్రెస్ కృపావతిగారికి ఎంత యిష్టమో ... వాళ్ళ స్కూలుకి 'ఫండ్స్' కావాలని డొనేషన్స్ కలెక్టు చెయ్యడంకోసం 'బెనిఫిట్‌షో'లు ఎరేంజి చేశారు చాలాచోట్ల. ఎక్కడ వేసినప్పుడు అందరిలోకీ లక్ష్మి చాలా టిక్కెట్లు అమ్మిపెట్టింది. అందుకని వాళ్ళ మిసెస్

# విద్యార్థి

వున్న మీగతా వూళ్ళల్లోకూడా చందాలు వసూలు చెయ్యడానికి లక్ష్మినే తీసుకు వెళ్ళారావిడ ... అప్పటికి నాకు ఒంట్లో బానే వుంది... అయినా యిదేమిటి రోడ్డు మీద ఈ సంభాషణ ? ... రండి అలా హోటలుకు వెళ్దాం.'

'హోటలు!...హోటలు లేదు ఏమీ లేదు ...ముందు మీరు రిక్షా ఎక్కండి.' ఆజ్ఞాపిస్తున్నట్లు అన్నాడు విద్యార్థి.

'విద్యార్థిగారూ... మృత్యువుతో హోరాహోరీ పోరాటం జరిపి, నన్ను ఓడించాలనుకున్న దేముడ్ని చిత్తు చిత్తుగా ఓడించేసి బ్రతికి బయటపడితే నాకు పార్టీ యివ్వరా విద్యార్థిగారూ...'

'పార్టీ లేదు గిర్టీ లేదు ... నిన్నగాక మొన్న టైఫాయిడ్‌పడి లేచారు. హోటల్లో తింటే ఏమన్నా వెయ్యొచ్చు ... అందుకని నేను పార్టీ యివ్వను జ్ఞానాంబగారూ...'

మాట మధ్యలోనే అడ్డు వచ్చింది జ్ఞానాంబ. 'పోని మీరివ్వ పోతే నే నిస్తాను రండి.' అంటూ హోటల్లోకి దారి తీసింది.

'ఈ జ్వరంతో మీకు మతిగానీ పోయిందా జ్ఞానాంబా...[illegible] 'పత్యం' జాగ్రత్తని మరీ మరీ చెప్పాడు. పోనీ ... ఒక్క కాఫీ మాత్రం తీసుకుందాం వుండండి.' అంటూ హోటల్లోకి వచ్చి ఒక టేబిల్ దగ్గర కూచుంటూ, 'రెండు కాఫీ' అన్నాడు అప్పుడే వచ్చిన సర్వర్‌తో.

జ్ఞానాంబ అతడి మాటలు ఖాతరు చెయ్యకుండానే సర్వర్‌ను 'మెనూ' అడిగి, రెండు ప్లేట్లు పెరుగు వడకు ఆర్డరిచ్చి, విద్యార్థి వైపు తిరిగి, 'మతి పోవటం కాదు విద్యార్థిగారూ... మతి యింకా గట్టిపడింది. నామీద నాకు నమ్మకం పెరిగి, ఆత్మ విశ్వాసం బలపడింది. ఇక నాకు అపజయమన్నది లేదు విద్యార్థిగారూ ... నన్ను ఏదీ ఏమీ చెయ్యలేదు. ఒకానొక క్షణాన... ఓడిపోతానేమోనని భయపడ్డాను కానీ ... నేనే గెలిచాను ... దాంతో నాలో కొత్త వుత్సాహం, కొత్త శక్తీ వచ్చింది... ఇక నాకు భయం లేదు విద్యార్థిగారూ.' అంది ఆవేశంగా...

అప్పుడే సర్వరు తెచ్చిన ప్లేట్లు అందుకోబోతున్న జ్ఞానాంబను వారిస్తూ, 'ప్లీజ్ నామాట వినండి జ్ఞానాంబా ... పెరుగువడ తినవచ్చో తినకూడదో ... వుట్టి కాఫీ తీసుకోండి ... డాక్టరు దేవసహాయం గారు పత్యం మాట మీతో చెప్పలేదా?' అన్నాడు ప్రాధేయపడుతున్నట్లు...

'అబ్బ...ఏమిటండీ అన్నిటికీ భయాలు!' ప్లేటు అందుకుని వడ తుంచుకుని తింటూనే, 'విద్యార్థిగారూ ... నేను చచ్చిపోతానని భయమా?... అలాంటి భయాలూ గియాలూ పెట్టుకోకండి... మీ పిచ్చిగానీ. అసలు ఆ యములాడు నన్ను చూస్తే హడలిపోతుటండీ ... అటు స్వర్గలోకం వాళ్ళూ యిటు యమలోకంవాళ్ళూ, మాకొద్దంటే మాకొద్దని నన్ను తిప్పి పంపుతారు దణ్ణం పెట్టి ... అంతగా తిరగబెడితే మీ దేవసహాయం వున్నారుగా...' నవ్వుతూ అంది జ్ఞానాంబ.

ఎన్నడూ లేదు ఏమిటింత మొండిగా మాట్లాడుతోంది... అనుకుంటూ, 'ఆఁ... ఆఁ... వుంటాడు వుంటాడు... మన ఆరోగ్యం కాపాడుకోవాలని మనకే లేకపోతే డాక్టరు దేవసహాయం కాదు... అసలు దేముడుకూడా కాపాడలేడు...మానవ ప్రయత్నానికి దేముడి సాయం వుంటుంది కానీ... మరీ మొండిగా ఛాలెంజింగ్‌గా మాట్లాడకండి... ఆత్మవిశ్వాసానికి అహంభావం తోడు అయితే పర్యవసానం ఆత్మవినాశనమేనని యిదివరలో ఒకసారి చెప్పాను గుర్తుందా?'

'విద్యార్థిగారూ దయచేసి యిలా మాట్లాడకండి...ఈరోజు నాకెంతో సంతోషంగా వుంది... నన్ను నిరుత్సాహపర్చి భయపెట్టడానికి ప్రయత్నించకండి.'

'నేను భయపెట్టడానికి ప్రయత్నించటం లేదు... కొంచెం ఆలోచించమంటున్నాను... కనీసం హేతువాదం దృష్ట్యా చూచినా 'కాజ్ అండ్ ఎఫెక్టు' వుంటుంది. చేసిన దానికి పర్యవసానం అనుభవించాలి ... ఆవిధంగాచూస్తే దేముడనో, విధి అనో నమ్మేవాళ్ళపనే తేలిక... వాళ్ళు భారమంతా దేముడిమీద వేసి నిశ్చింతగా కూర్చుంటారు. మంచి జరిగితే, దేముడు చల్లగా చూశాడంటారు ... చెడు జరిగితే, మనఖర్మ ... అనుకుంటారు...కానీ—యిది అలా కాదు... విధిని నమ్మలేనివాళ్ళూ, విధికి ఎదురు తిరిగినవాళ్ళూ మంచికీ చెడుకూ, కూడా బాధ్యత తామే వహించాల్సి వస్తుంది కాబట్టి చాలా జాగ్రత్తగా వ్యవహరించాల్సి వుంటుంది ... ఆ విషయం మర్చిపోకండి' అన్నాడు.

'ఊరుకోండి విద్యార్థిగారూ ... మహా మహా దేముడికే దడవడదాన్ని... ఈ పెరుగు వడకు ... చలిమిడి ముద్దకూ దడవమంటారు! ... ఇంకా స్పేపుంటే మా ఫ్రెండ్...కొడుకు ముద్దకుడుముటంటూ... ఎంతో అభిమానంగా యిచ్చిన ఆ చలిమిడీ, మిఠాయికూడా పారెయ్యమనేలా వున్నారే... మనం భయపడ్డం మొదలుపెడితే అన్నీ మనల్ని భయపెడుతూనే వుంటాయి ... ఇక రండి వెళ్దాం' అంటూ సర్వర్ తెచ్చిన బిల్లులాక్కుని తనే డబ్బులు చెల్లించి బయటికి నడిచింది జ్ఞానాంబ ... విద్యార్థి ఆమెను అనుసరించాడు; యిక ఏం చెప్పినా లాభం లేదని బరువుగా నిట్టూరుస్తూ ... ఇవతలికి వచ్చాక, 'డాక్టరుగారు ... మందులూ, టానిక్కులూ రాసి యిచ్చారు గదా కొన్నారా?' అని అడిగాడు.

'ఆ...కొన్నానండి' అంది జ్ఞానాంబ [illegible] నడుస్తూ...

ఆమాట తీరు చూస్తే అనుమానం వచ్చింది విద్యార్థికి.

'నిజం చెప్పండి... లేకపోతే...యిక్కడే, నాకు తెల్సినవాళ్ళ షాపువుంది ... ఒకసారి కొనేసి వెళ్దాం' అన్నాడు.

'లేదులెండి ... విజయానందలో కొనేశాను.' నవ్వుతూ అని, 'ఇటునుండి పిక్చరుకు వెళ్దామనుకుంటుంటే. మెడికల్ షాప్‌కు తీసుకెళ్తామంటారేమిటండీ?... రండి...ఎన్నాళ్ళనుండో చూడాలనుకుంటున్న పిక్చర్ వచ్చింది.' అంది జ్ఞానాంబ...

'జ్ఞానాంబగారూ !...'

'ప్లీజ్ ... అడ్డం చెప్పకండి ... ఇవ్వాళ మిమ్మల్ని చూడగానే నాకెంత సంతోషంగా వుందో చెప్పలేను ... చూడండి ... నా జీవితంలో అసలు ప్రేమ అనేది పొందలేనేమో... అనుకున్నాను...కానీ ప్రాణప్రదమైన మీ ప్రేమను పొందగలిగాను ... అక్కయ్యను అత్తగారింటికి పంపడం, యీ కొద్ది జీతంలో నాకు సాధ్యమవుతుందా అని భయపడ్డాను...కానీ యించుమించు మొత్తం సమకూడినట్లే... ఈ జబ్బు మూలంగా ఒకటి రెండు వందలు తగ్గినా...మళ్ళీ ఎంతలో

# విజయ్ అమృతరాజ్, ఇండియా డేవిస్ కప్ ఆటగారు — దేహదారుఢ్యాన్ని కాపాడుకోడానికి ఫిలిప్స్ సైకిలు త్రొక్కుతారు




టెన్నిస్ మ్యాచ్‌లో, అమృతరాజ్ రిటర్న్స్ శీఘ్రము, నిశ్చితము. టెన్నిస్ కోర్టులో అతని శౌర్యం, పౌరుషంకూడా సుసంపన్నమైన దేహ సౌష్టవంమీద ఆధారపడి ఉన్నాయని అతడికి తెలుసు. అందంగా నిష్పన్నంగా ఉండడానికి ఫిలిప్స్ ప్రతిదినం అతడు తొక్కుతూనేవుంటాడు. ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఫిలిప్స్ సైకిల్ ఉత్సాహవంతులైన యువకులకు సైకిలు. దానికి మంచి రూపం ఇది అతిమృదువుగా సునాయాసంగా తిరుగుతుంది.

మా ఫిలిప్స్ రకాలు:

| |
|---|
| ఫిలిప్స్ ఒలింపియా (సూపర్బ్ మోడల్) |
| ఫిలిప్స్ లేడీస్ మోడల్ |
| ఫిలిప్స్ ఉత్సాహవంతులైన యువకులకు |



ఇండియాలో తయారీ.
టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు, మద్రాసు-53

ప్రొప్రైటర్లు
ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్
మద్రాసు

● పయోగించుటకు రిజిష్టరు కావింపబడినవారు.

TICPH-7039

రెండు నెలల్లో అది సమకూడుతుంది ...
'దేముణ్ని కొడన్నావ్. ఆ మ్యాలుబిల్డింగ్ కానే కాద'న్నారు...అంటరూ...కానీ నాలుగు నెలల్లో చదువు పూర్తికావస్తోంది...అదయి



పోగానే వుద్యోగం దొరికితే, ఆ స్కూలు వని ఎంతసేపు!...ఇక నా లక్ష్యం నెరవేరి



వచ్చే విద్యార్థిగారూ...ఇక యీ జబ్బు అంటూరా?...పందెంతో పరుగు తీసేటప్పుడు అలుపొస్తుందని, ఆగిపోయి, వెనుకపడు తానని బెదిరిపోతే ఎలా?...అయినా ఇందులో కూడా మృత్యువును ఓడించాను...విజయో త్సవం జరుపుకోవల్సిన వేళప్పుడు.. అన్నిం టికీ యిలా అడ్డు చెప్పకండి...'

'విజయోత్సవమా?!...' ఆ మాటలు వింటుంటే అతడి గుండెలు గుబగుబలాడు తున్నాయి ఎందుకో...

'అవును ... మానవ శక్తి అజేయం. విద్యార్థిగారూ...అజేయం.'

'మానవశక్తి అజేయమే...కానీ అలాగని మనం అహంభావం ప్రదర్శించి నప్పుడు మనలోని వివేచనాజ్ఞానం నశించి ఆత్మ హత్యా సదృశవౌతుంది... పరుగు తీసే టప్పుడు సుళువు మెళువులుకూడా తెలుసు కోవాలి జ్ఞానాంబగారూ...నాకేమని ప్రమ త్తులమైతే...ఫలితం మనం ఆశించినట్లు వుండదు...'

'విద్యార్థిగారూ...ఇన్ని రోజులయి నేను మిమ్మల్ని ఏ కోరికా కోరలేదు...ఈ ఒక్క కోరికను తీర్చలేరా?...అంతగా యిష్టం లేకపోతే నాకు మీతో రావడం యిష్టంలేదని చెబితే సరిపోతుందిగా' అంది నిష్ఠూరంగా...

'జ్ఞానాంబగారూ!!...' అన్నాడు ఆ మాటతో గాయపడ్డ మనసుతో... తర్వాత ఏకక్షణం ఆలోచించి 'సరే పదండి...ఏమయితే అదవుతుంది.' అన్నాడు మెల్లిగా...

'అయితే యీ కవరు యింట్లోపడేసి వెళ్ళిపోతాం...' అంది జ్ఞానాంబ అమితో త్సాహంతో...

ఇద్దరూ జ్ఞానాంబ యింటికివెళ్ళి అటు నుంచీ సినిమాకి వెళ్ళారు...అక్కడకూడా విద్యార్థి ఎక్కువగా మాట్లాడలేదు. అతడి కేదో భయంగావుంది...ఇది అది అని చెప్ప లేని ఆరాటంగావుంది మనసులో...

పిక్చర్ అయిపోయింది. జ్ఞానాంబను యింటి దగ్గర దింపుతూ, 'జ్ఞానాంబ గారూ ... మాకు సమ్మెమూలంగా కాలేజికి నెల రోజులు సెలవులిచ్చారు. అక్కడే యిల్లు రిపేర్లు మొదలెట్టాం...అది దగ్గ రుండి పూర్తిచేయించాలి అది ఒకవందలో చేయించాలని మొదలు పెడితే అది యిప్ప టికే అయిదారు వందలు పైనయింది. ఇంకా రెండు మూడు వందలు పట్టొచ్చు.

ఈ ఏటికీ యిక అప్పతీర్చే ప్రసక్తే లేదు. అందుకని అన్నింటికీ వడ్డీలు కట్టాలనుకుంటున్నాను. ఆ పనులన్నీ కాగానే వచ్చేస్తాను నేను. జ్ఞానాంబా!... యిన్నాళ్ళూ నా కలలు ఫలింపజేయ్యాలని మురిసిపోతున్నాను నా ఆశలు వమ్ము చెయ్యరుకదూ! ... మీ కోసం కాకపోయినా కనీసం నా కోసమైనా మీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటారు కదూ?" ఆత్రుతసిక్త సంయోగాలతో ఆర్ద్రమైన స్వరంతో ఆమెను ఒక్కసారి గుండెలకు కరుచుకుంటూ అన్నాడు మెల్లిగా.

జ్ఞానాంబ అతడి బాహుబంధం నుండి







పిల్లలు పార్లే బిస్కట్లు తినాలి
పెరిగే ఆనందంతో వుండాలి

భారతదేశంలో అత్యధికమైన అమ్మకం కలిగిన బిస్కట్లు పార్లే గ్లూకో

తప్పించుకుంటూ, మీరు నాకోసం దిగులు పెట్టుకోకండి. మీరు వచ్చేసరికి బాగా కోలుకుంటానుగా. అసలు మీరు గుర్తుపట్టలేనట్లుగా తయారవుతాను. 'జ్ఞానాంబ ఏది?' అని అడగాలి మీరు సరేనా? .. ఇక వెళ్తాను. గుడ్‌నైట్, చీరియో ..' అంటూ మొట్టమొదటిసారిగా అతడి చేతిని అందుకొని గాఢంగా ముద్దు పెట్టుకుని వదిలేసి, వడివడిగా అడుగులేసుకుంటూ చీకటిలోకి వెళ్ళిపోయింది జ్ఞానాంబ.

విద్యార్థి గుండెలు బరువెక్కాయి ఎందుకో. ఆ అమ్మాయివెంటే లోపలికి వెళ్ళాలనిపించింది. కానీ బలవంతాన నిగ్రహించుకుని, చీకటిలో అదృశ్యం అవుతున్న జ్ఞానాంబను ఒక్కసారి చూశాడు. అతడికి తెలియకుండానే ఒక వేడినిట్టూర్పు వచ్చింది. అడుగులు అయిష్టంగానే యింటి వైపు పడసాగాయి.

అతడు వూరికివెళ్ళాక యింటిపని పూర్తి చేయించాడు. ఇంటి పన్ను పొలం తహసీలు కట్టేశాడు. మిగిలినదాంట్లో తన ఖర్చుకు కొంచెం వుంచుకుని మిగతాది యింటి ఖర్చుకు వుంచాడు. రెండోపంట మినుము కొంచెం ఆశాజనకంగానే వుంది. శివరాత్రికి ఆ పంటవస్తే ఆ డబ్బు పొలం శిస్తుకు అట్టే పెట్టుకుంటే సరిపోతుందనుకున్నాడు. ఇక రేపు గుంటూరు బయలుదేరుదాం అనుకుంటుండగా వాళ్ళక్కయ్య దగ్గరనుండి వుత్తరం వచ్చింది...పిల్లవాడికి అన్నప్రాసన జరుపుతున్నారట. అనుకోకుండా ముహూర్తం పెట్టుకున్నందున ముందుగా తెలియబర్చడానికి వ్యవధిలేదు కాబట్టి, యిదే టెలిగ్రాంగా భావించి వెంటనే బయలుదేరి రావలసిందని రాశారు. వాళ్ళ మామగారికి ఆరోగ్యం సరిలేనందున యిలా అకస్మాత్తుగా అనుకోవల్సి వచ్చింది కాబట్టి ఏమీ అనుకోవద్దనీ, తప్పక రమ్మనీ రాసింది.

భార్యాభర్తలిద్దరికీ బట్టలూ, బాబుకు వెండిగిన్నె కొన్నది ధనమ్మగారు. వెంటనే బయలుదేరమని కొడుకును తొందరచేసింది. ఇక బయలుదేరక తప్పలేదు విద్యార్థికి. అతడి మనసంతా గుంటూరు మీదేవుంది. అందుకనే 'ఆరోగ్యం జాగ్రత్త' అని

జ్ఞానాంబకు వుత్తరం వ్రాసిపడేసి అక్క గారి వూరు వెళ్ళాడు...

అన్నప్రాసన, కేశఖండన బాగా ఘనం గానే చేశారు...మేనమామకు బట్టలుకూడా పెట్టారు ... ఆరోజునే తిరుగుప్రయాణం కట్టిన విద్యార్థిని ఎటూ సెలవులేకదా ... రెండురోజులుండమని బలవంతం చేశారు బావగారు... అక్క నిష్ఠూరంగా మాట్లా డింది...ఇక తప్పలేదు విద్యార్థికి...అయితే ఆ రెండోరోజున మంచంలోవున్న అక్క మామగారికి అకస్మాత్తుగా విషమించి, మర్నాటికల్లా యిహలోకయాత్ర చాలించా రాయన...

ఆ యింటికి విద్యార్థి బావగారే పెద్ద...అతడి తర్వాత వరుసగా నలుగురు ఆడపిల్లలు ... తర్వాత యిద్దరు మొగ పిల్లలు... వాళ్ళిద్దరూకూడా చిన్నవాళ్ళు... బావగారికి సాయంగా రెండురోజులున్న విద్యార్థి మూడోరోజు బయలుదేరు తుంటే, అక్కవచ్చి పీటముడి పెట్టింది... ఒకతట్టు నిత్యకర్మ జరుగుతుంటే ... బంధువులన్నవాళ్ళు యిలాంటప్పుడు ఆదు కోకపోతే ఎందుకురా ? ... అని మందలించింది...బావగారూ అదేమాట అనడంతో తండ్రి పోయి అవస్థలోవున్న ఆయన మాటను కాదనలేకపోయ్యాడు విద్యార్థి...

ఆ పదిరోజులు వూపిరి సలపలేదు విద్యార్థికి ... బావగారికి బోలెడు బలగం వుందిగానీ అంతా తిన్నంత తిని లోపాలు ఎంచేవాళ్ళే ...ఇక డబ్బు పెత్తనం దగ్గర నుండీ, బస్తీకిపోయి సామాన్లు కొనుక్కు రావడం, చివరికి వడ్డనలదగ్గర కూడా విద్యార్థి నిలబడక తప్పలేదు...ధనమ్మగారు పదవరోజున వచ్చి, పన్నెండవరోజున వెళ్ళి పోయింది... విద్యార్థి పదమూడోరోజుకూడా వుండి మర్నాడే బయలుదేరి వచ్చాడు ... అప్పటికి అటునుండి అటే గుంటూరు వెళ్ళాలనివున్నా తీసుకెళ్ళిన డబ్బు అయి పోవడంతో తప్పనిసరిగా యింటికే రావల్సి వచ్చింది...

(ఇంకా ఉంది)

దీపావళి కథలపోటీలో రు ౫౦౦ బహుమతి పొందిన కథ

# 'రంగధామ్' వెండి అరటాకు



'అంజయ్యగారిల్లు సోదా చేసినా రంటగా?' అని, శంకరయ్య కాఫీ హోటలుదగ్గర ప్రొద్దున్నే మొహం కడుక్కుంటూ, ఒక ఆసామి చుట్టూవున్న నలుగురి నుద్దేశించి అన్నాడు.

'ఆ! రాత్రి ఎల్లార్యూ పోలీసు లాడనే వున్నారు.' అని మరొక పెద్దమనిషి ఆ వార్తను రూఢి చేశాడు. సంగతేమిటో తెలుసుకోవాలని మరికొందరు ఆసక్తి కనబర్చారు.

'ఏమన్నా దొరికిందటనా?'

'ఏందో మరికొందరు దొరికిందంటున్నారు, కొందరు లేదంటున్నారు' అని మరోవ్యక్తి తన సందేహాన్ని వెలిబుచ్చాడు. సరియైన సమాచారం కోసం అందరూ ఏదుము జూస్తూనే కాఫీ ఫలహారాలు కానిస్తున్నారు.

ఆ సమయంలో ఒక పాతికేళ్ళ యువకుడు దూకుడుగా కాఫీహోటల్లోకి ప్రవేశించాడు. అతను పైజమామీద లాల్చీ వేసుకున్నాడు. ఉంగరాల జుట్టు మొహంలో అతని ఉత్సాహంచూసి, అతనికి తాజా వార్తలు తెలిసి వుంటాయని కొందరతని చుట్టూ చేరారు.

'ఏం రంగయ్యా! పోలీసోళ్లు ఏప్పైనా పట్టుకున్నారా?'

'వాళ్లు పోలీసోళ్లు కాదయ్యా, కస్టమ్సు వాళ్లు' అని రంగయ్య చెప్పసాగాడు.

'ఏందది? అళ్లెందు కెళ్లారు అంజయ్య ఇంటికి?'

'బంగారం దాచేడేమోనని ఇల్లు సోదా చేస్తున్నారు.'

'బంగారమా! అట్టాచెప్పు. ఆడింట్లో బంగారానికేం తక్కువా. ఆడి ఇల్లంతా బంగారమే. ఆడిదగ్గర బంగారపు ఇటికలే వున్నాయి. ఉంటె ఏటి జేస్తారు?'

'ఏంజేస్తారా, పట్టుకుంటారు. రూలు ప్రకారము ఎంత వుండాలో అంతే వుండాలి. అంతకన్నా ఎక్కువుంటే లాక్కుంటారు' అని వాళ్లకు వివరించసాగడు.

అయితే అంజయ్య దగ్గర ఏ మాత్రం ఎక్కువ వుందేంటి?'

'చాలానే వుండచ్చు' అని రంగయ్య కాఫీ తాగడం మొదలెట్టాడు.

అంతవరకూ మౌనంగావున్న ఒక వయో వృద్ధుడు, 'ఉంటేమాత్రం ఈళ్లకి దొరుకుతుందట్రా. ఆడి జాగ్రత్తలో ఆడుంటాడు. అంజయ్యంటే అల్లాటప్పయ్యకాదు. గుండెలు తీసినబంటు.' అని తన తెలివి వెలిబుచ్చాడు.

'ఆ! అలాగేం? అయిదారు లక్షల సరుకు దొరికిందటున్నారు.' అని రంగయ్య సవాలు జేశాడు.

'పోరా! కుర్రయేదవా! ఇలాంటివి ఇన్ని (గుప్పెడు తన తలవెంట్రుకలు చూపించి) చూశాను. రేపీపాటికి అంతా సర్దుకు పోతుంది. అసలు ఆడిదగ్గర ఆ బాపతు సరుకే లేదంటారు. ఈ యాఫీసర్లందర్నీ ఆడు ఈపాటికి బుట్టలో వేశేసే వుంటాడు. అంతగా ఎవడైనా ఆఫీసరు తిక్కరకం యేషాలేస్తే, ఆడిసేతులో నలుగురు మంత్రులున్నారు, ఆళ్ళకి ఫోనుచేస్తే చాలు, ఆడిపనిసరి' అన్నాడు ముసిలాడు.

ముసిలాడి మాటల్లోని యదార్థం కొందరు నడివయస్కులు గుర్తించారు. అంజయ్యంటే, నంబూరులోకల్లా పెద్ద ధనికుడు. అతనికి అనేకరకాల వ్యాపారాలున్నాయి. రాజకీయనాయకులతో గాఢ పరిచయాలున్నాయి. ఆ పల్లెటూరులో అతనిమాటకు తిరుగులేదు.

'అంతేలే, డబ్బున్నవాణ్ణి ప్రభుత్వం ఏటీ సెయ్యలేదులే' అని పరిస్థితులతో రాజీపడ్డారు నడివయస్కులు.

కుర్రకారుమాత్రం అందుకు ఒప్పుకోలేదు. కష్టమ్సువాళ్ళకి అంజయ్య దాచిన బంగారం దొరికితీరుతుందనీ, దానితో అంజయ్యపని సరి అనుకోసాగారు. 'ఇలా ధనవంతులందరిదగ్గర దాగిన బంగారం, గుప్తధనం, ప్రభుత్వానికి దొరికిపోతే సోషలిజం రావడం ఎంతసేపు!' అని ఆశపడ్డారు.

వాళ్ళతో చర్చించడం అనవసరం అనీ, రెండురోజుల్లో అసలు విషయం బయటపడుతుందనీ, అప్పుడు వాళ్ళే నిజం తెలుసుకుంటారని వయోవృద్ధులు ఊరుకున్నారు.

శంకరయ్య హోటలువద్ద ఆ చిన్న పల్లెటూరులో ఏం జరిగినా నలుగురూ చర్చిస్తారు.

అంజయ్య ఇంటిని సోదా చేస్తున్నారని ఊరంతా గుప్పుమంది. అనేకులు అనేకరకాలుగా అన్నారు. కొందరు రెండులక్షల సరుకు దొరికిందంటే మరికొందరు దాన్ని రెండింట్లు గుణించి చెప్పారు. మొత్తానికి ఎంతో కొంత దొరికి తీరుతుందని కొందరు ఆశావాదం ప్రకటించారు.

అతని శత్రువర్గం మాత్రం ఒకందుకు సంతోషించారు. ఇది అంజయ్య పరువుప్రతిష్ఠలకు ఒక గొడ్డలిపెట్టు. ఏదైనా దొరికి అతనిమీదకు కేసువస్తే ఊళ్ళో అతని బలం చాలా తగ్గుతుంది. 'తగ్గాలి కూడనూ! లేకపోతే అంజయ్య అంటే అందరికి హడలైపోయింది. అతను ఖూనీ చేయించినా అడ్డులేకుండా పోతోంది,' అని వాళ్ళ ప్రచారం.

పేరుమాత్రం రావణాసురుడికున్నంత పేరున్నా, అంజయ్య రూపం మాత్రం బహుసామాన్యంగా వుంటుంది సన్నగా, పొట్టిగా, ఎర్రగా వుంటాడు. మొహం విశాలంగా వుండి కళ్ళు సన్నగా వుండి చైనావాళ్ళ రూపురేఖలు గుర్తుకొచ్చేలా వుంటాయి. తెల్లటి పంచెమీద, తెల్లని పొడుగుచేతుల చొక్కా వేసుకుని, వేళ్ళ మధ్య గోల్డుఫ్లేకు సిగరెట్టు పెట్టుకుని, ఎప్పుడూ హడావుడిలో వున్నట్టు, కారులో నంబూరూ, గుంటూరుల మధ్య తిరుగుతుంటాడు మాటల్లో దర్పంతో పాటు వచ్చి బూతుల ప్రయోగం విపరీతంగా వుంటుంది. ఎప్పుడూ దోసుమీద వుంటాడని ప్రతీతి. అతని వయస్సు ఏభైయేళ్ళు.

తనింట్లో సోదా జరిగిన మరునాడు, తనింటికి వచ్చిన ఇద్దరు రైతులతో ముందు హాలులో, కుర్చీలో బాసింపట్టు వేసుక్కూచుని, సోదాగురించి మాట్లాడసాగాడు. 'ఎవడో, నా...(బూతు) గాడు నాయింట్లో బంగారం వుందని చెప్పాడు. ఆడెవడో ఆడికే మూడిందిలే. మనూళ్ళో ఫాల్తూరకం బేవార్సుగాంగు ఒకటి తయారయింది. ఈ నా...గాళ్ళ కింకేం పనిలేదు. ఎవడి కెంత డబ్బుందా అని ఏడుస్తూంటారు' అన్నాడు అంజయ్య.

ఆ రైతులిద్దరిలో ఒకతనికి అంజయ్య దగ్గిర బాగా చనువుంది అతను 'అసలింతకీ ఏమన్నా దొరికిందా ఆళ్ళకి?' అని సూటిగా అడిగాడు.

'నా...(బూతు)...ఏందిరా పట్టుకునేది! నాకాడేముందిరా? ఈ నా...(బూతు)... గాళ్ళందరూ పట్టుకోవడమే! అసలీ ఆఫీసర్లు నా యిల్లంతా గందరగోళం చేసినందుకు ఈళ్ళని పట్టుగోవాలి. మా లాయరుతో మాట్లాడాలి. ఒరేయ్! అసలు దీనికంతా కారకుడెవరో ఆణ్ణి పట్టి వ్యాకపోతే సూడు' అని తన ఇష్టమొచ్చినట్లు బూతులు ప్రయోగించి తిట్టూంటే, అంజయ్య బాగా తాగివున్నాడని ఆ రైతులు గ్రహించారు.

ఏమీ దొరకలేదని అంజయ్య అనకముందే ఊళ్ళో తెలిసిపోయింది. అది చాలామందికి ఆశ్చర్యం కలిగించినా ఇందులో ఏదో కిటుకు వుందని వాళ్ళు గ్రహించారు.

ఇన్‌స్పెక్టర్ గిరిధర్, తన ఇంట్లో రహస్య సంభాషణ జరుపుతున్న ఒక వ్యక్తితో, 'ఒక్క తులమైనా ఎక్కువ లేకుండా దాచేసేదంటే, బాగా ముందుగానే మన సోదా జరగబోతుందని తెలిసివుండాలి' అని అన్నాడు మెల్లిగా, కుర్చీలో కూచుని, తల వెనుకకు వేలేసి, ఆలోచిస్తూ. అతని కెదురుగా కూర్చున్న వ్యక్తే, మొదట అంజయ్య ఇంట్లో బంగారం గురించి ఆచూకీ ఇచ్చిన వ్యక్తి.

అతనిద్వారానే, అంజయ్యకు సోదా గురించి ముందుగానే ఎలా తెలిసిపోయిందో తెలుసుకుంటున్నాడు పెద్ద ఆఫీసరుతో అంజయ్యకు పరిచయం వుండడంవలన, ఆయనద్వారానే, అంజయ్యకు సోదాగురించి సూచన అందివుంటుందని ఆ వ్యక్తి తన అనుమానం వెళ్ళబుచ్చాడు. అందుకుగల ఆధారాల్ని అతను చెప్తూంటే విని గిరిధర్ ఆశ్చర్యపోయాడు.

ఉత్సాహంగా పనిచేసే గిరిధర్‌లాంటి యువక ఆఫీసరకు, ఇలాంటి అడ్డుగోడ లెదురైనప్పుడు విధినిర్వహణయందే విరక్తి కలుగుతుంది. అతనికి ముప్ఫైయేళ్ళుంటాయి. మంచి పర్సనాలిటీతో, ఆకర్షణీయమైన మొహంతో, అతనిలో ఎప్పుడూ చురుకుదనం, ఉత్సాహం తొణికిసలాడుతూ వుంటాయి

రాత్రి పదిగంటలదాకా ఆ వ్యక్తితో మాట్లాడి పంపేశాడు గిరిధర్. ఆ వ్యక్తి వెళ్ళిన చాలాసేపటివరకూ ఒక్కడే ఆలోచిస్తూ కూచున్నాడు.

సోదా జరిగిననాటి సంఘటనలన్నీ అతను నెమరువేసుకోసాగాడు. తనూ ఇన్‌స్పెక్టరు ధనరాజూ, సూపరింటెండెంటు పాల్‌గారూ అంజయ్య ఇంటిని క్షుణ్ణంగా సోదా చేశారు. సోదా జరిగినంతసేపూ అంజయ్య కళ్ళు నిప్పులు కక్కుతున్నట్లున్నాయి. ఇనప్పెట్టి తాళాలిమ్మంటే ఇవ్వలేదు. పోయాయని అబద్ధమాడాడు. తాము ఇనప్పెట్టె పగులకొట్టించాల్సి వచ్చింది. అయినా అందులో ఏమీ లేదు అప్పుడే

# వెండి అరటాకు

తనకు తట్టింది, అంజయ్య ముందుగా జాగ్రత్తపడే, నాటకం ఆడుతున్నాడని. పోల్‌గారికి పట్టుదల హెచ్చింది. ఇంట్లో వున్న అన్నితాళాలూ పగులగొట్టించాల్సి వచ్చింది.

ఆలోచిస్తూనే కిటికీలోంచి ఆకాశం వైపు చూశాడు. నవమి చంద్రుడూ, నక్షత్రాలూ మెరుస్తూ కన్పించాయి. ఆ చల్లని వెన్నెల, సోదాగురించి రోషంగా ఆలోచిస్తున్న అతని మనసును, సోదానాడు జరిగిన మరొక వింతఘట్టంవైపు మరల్చింది. అతనికి అంజయ్యకూతురు సరళ జ్ఞాపకమొచ్చింది. ఆమె వయస్సు ఇరవై రెండు వుండవచ్చు. తెల్లటి చీరకట్టుకుని, రేగిన జుట్టుతో, సోగకళ్లతో, తలుపురెక్క పట్టుకు నుంచుని, తనవైపు జాలిగా చూసినచూపు తనెన్నడూ మరువలేదు.

ఆమె పెట్టి తాళం పగులగొట్టి సోదా చేస్తున్న ధనరాజు, చాలసేపు ఆమె పెట్టి వద్ద తచ్చాడాడు. ఆ పెట్టిలో ఆమె బట్టలు తప్ప ఏమీలేవు. ఆ బట్టల మధ్యనుండి కొన్ని ఉత్తరాలు బయట పడ్డాయి. వాటిని తనకిమ్మని ఆమె ప్రతిమాలింది. కాని, ఇస్తానంటూనే, ఆ పెట్టె తణిఖీ చేస్తున్నట్లు నటించి, ఆ వుత్తరాల్ని చదువుతున్నాడని తన అనుమానం.

ఆ సమయంలో తనువెళ్లేడు. ఆమె, తాను పరిస్థితిని గమనించి ఆ ఉత్తరాలు తన కిప్పిస్తానేమోనని జాలిగా తనవైపు చూసింది. పరిస్థితి నర్థం చేసుకునేసరికి రెండు నిముషాలు పట్టింది తనకు. అవేవో ప్రేమ లేఖలై వుంటాయి. ఆమె వివాహితే. తన భర్త దగ్గరనుంచి వచ్చినవైతే ఆమె భయపడ నవసరమేముంది? బహుశా ఏ ప్రియుని వద్దనుంచో వచ్చినవి కాబోలు, ననుకున్నాడు.

అందుకనే ఆ సమయంలో తండ్రి వస్తూంటే, అతనికి చూపవద్దన్నట్లు ధనరాజ్‌కు సైగచేసి, అక్కణ్ణుంచి తప్పుకుంది.

ఆమె బాధంతా వెళ్ళిపోతూ తనవైపు చూసిన చూపులో, వేటకాడివలలో చిక్కు పడ్డ పక్షి చూసేచూపులా వుంది ఆ చూపు.

గిరిధర్‌కు తన చెల్లెలు జ్ఞాపక మొచ్చింది. చెల్లెలు పెళ్ళిగురించి తన తల్లి రోజూ గొడవచేస్తూండేది. 'ఎందుకలా అంత గొడవ చేస్తావు? ఇప్పుడు దాని పెళ్ళికి తొందరేమి వచ్చింది, దాని వయస్సింకా పదిహేడే కదా' అని తనంటే, తల్లి, 'నాయనా, ఆడదాని జీవితం ఎంత దుర్గమమైనదో తెలుసా; అది అరిటాకు లాంటిది. ముల్లొచ్చి అరిటాకు మీద పడ్డా, అరిటాకు ముల్లుమీద పడ్డా ఆకుకే నష్టం' అనేది తన తల్లి.

ఆమె అలా అంటే తన తండ్రి, ఆయన భోజనం చేస్తున్న వెండి అరటాకును చూపించి, ఇలాంటి అరటాకైతే ఏమీ కాదు.' అనేవారు.

'చాల్లెండి మీ వేళాకోళాలు. ఇప్పుడు వెండి అరటాకును గురించి ఎవరన్నారు.' అనేది తన తల్లి.

మళ్ళీ అతనికి, ఆ వుత్తరాలు చదువు తున్నప్పుడు, ధనరాజ్ మొహంలోని ఆశ్చర్య విషాదాలు గుర్తుకొచ్చాయి. అది చదువుతూ ఏదో షాక్ తిన్నవాడిలా అయ్యాడు ధనరాజు. అప్పటినుంచీ ఏదో ఆలోచిస్తున్న వాడిలా కన్పించసాగాడు. తరువాత అంజయ్య వైపు చాలా తీక్షణంగా రెండు మూడుసార్లు చూశాడు. ఆ వుత్తరాల్ని మళ్లీ ఆమె పెట్టిలో పెట్టేసే వుంటాడని తనను కున్నాడు; కాని పెట్టాడో లేదో కనుక్కో వడం తను మర్చిపోయాడు.

రాత్రి చాలా ప్రొద్దుపోయినా గిరిధర్‌కి నిద్ర రాలేదు. అతని ఆలోచనలు, ధనరాజు మీదకి మళ్ళాయి.

ధనరాజు, తనకన్నా చాలా పెద్దవాడు; చాలా సర్వీసుంది. అయినా అతనికి ప్రమోషన్ రాలేదు. అందుకు కారణం అతని తాగుడు; అతను తాగుతాడని పై ఆఫీసర్లకు తెలుసు. తప్పతాగి ఒక్కొసారి రెండుమూడురోజులు స్పృహలోనే వుండడని కూడా వాళ్ళకి రిపోర్టులు వెళ్లాయి. అసలతని వుద్యోగం ఎప్పుడో పోయివుండ వలసింది. ఎన్నోసార్లు తాగి, వంటిమీద తెలివిలేకుండా ఆఫీసు కాగితాలు పారేసిన సంఘటనలు వున్నాయి.

అయినా అతనిమీద కొంతరికి, అంటే పై ఆఫీసర్లకు జాలివుంది. దానికి కారణం అతని కుటుంబ పరిస్థితులు. అతనికి ఒక్క కూతురు మాత్రమే వుంది. పేరు శశిరేఖ: ఎం. బి. బి. యస్. చదువు తోంది. ఇరవైమూడేళ్ల వయసుంటుంది దానికు. పదేళ్ళక్రితం, అతని భార్య

కొడుకూ ఒక బస్సు ప్రమాదంలో దారుణంగా మరణించారు. అది అతనికి పెద్ద షాక్‌లా తగిలి, మతిపోయేటంత పనైంది. అసలు అప్పటినుంచే అతను తాగడం మొద లెట్టాడనీ, వాళ్ళ జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా తప్పతాగి, ఒకటి రెండు రోజులు ఏ రోడ్డుమీదనో పడి దొర్లుతూంటాడని అంటారు.

మామూలుగా ఉన్నప్పుడు అతనంత సౌమ్యమైన మనిషి మరొకడుండడని పిస్తుంది. నల్లగా, సన్నగా, సుమారు అయిదడుగుల ఏడంగుళాల ఎత్తుగ

---

## వెండి అరటాకు

మనిషి. యూనిఫారమ్‌లో కాస్త జబర్దస్తీగా కన్పించినా, బనీను లుంగీతో వున్నప్పుడు, తాగుడు అతనినెలా సర్వనాశనం చేస్తోందో, కృశించిన అతని శరీరం తెలియ బరుస్తుంది.

శశిరేఖకు పెళ్ళి కూడా నిశ్చయమైంది. వరుడు శాంతిస్వరూప్ కూడా గిరిధర్‌కు బాగా తెలుసు. అతను మంచి టెన్నిస్ ఆటకాడు. కండలు తిరిగిన అతని శరీరం, తీర్చిదిద్దినట్లున్న కనుముక్కుతీరూ, పొడుగాటి అతని రూపం గ్రీకుదేవతల రూపాన్ని గుర్తుచేస్తాయి. అతనికొక స్కూటరుంది; దానిమీద, తెల్లని టెన్నిస్‌షార్ట్సు, బనీను మీద స్వెట్టరూ వేసుకుని, నల్ల కళ్ళ జోడు పెట్టుకుని తిరుగుతూంటాడు. అమ్మాయిలకు అతనంటే చాలా ఆకర్షణలా కన్పిస్తుంది. అతని వయస్సు పాతికేళ్ళు. అతనికికూడా అమ్మాయిలతో స్నేహం ఇష్టంలాగుంది. చాలామందితో అతనికి పరిచయమున్నట్లుంది. ఎందుకంటే, అతని స్కూటరు వెనుకసీటుమీద, ప్రతిసారీ ఒక కొత్త అమ్మాయిని కూచోబెట్టుకుని వెళ్తూండడం చూసినట్లు గిరిధర్‌కు గుర్తు. అయితే తనుచూసింది నాలుగైదు సార్లే.

ఏది ఎలాగున్నా, శశిరేఖా శాంతిస్వరూప్ ఒకరు నొకరు ప్రేమించుకున్నారు. మరొక పదిరోజులలో వారి వివాహం జరుగుతుంది. ఆ సిటితో శశిరేఖ వెడలిపోతుంది. శశిరేఖ డాక్టరై రెండుచేతులా సంపాదిస్తూంటే, శాంతిస్వరూప్ స్కూటరుమీద జల్సాగా ఖర్చుపెడుతూ తిరుగుతూంటాడని వాళ్ళ భవిష్యత్తును ఊహించాడు గిరిధర్. ఆ రకపు యువకులంతే. వాళ్ళకి జల్సాగ తిరగడమే జీవిత ధ్యేయము. అమ్మాయిలు కూడా అలాంటి వాళ్ళంటే ఆసక్తి చూపిస్తారు. కొందరు అలాటి యువకులంటే, పడిఛస్తారు — అనుకొని గిరిధర్ మెల్లిగా పక్కమీదకు చేరి, నిద్రకుపక్రమించాడు.

మర్నాడు ప్రొద్దున్నే గిరిధర్, ధనరాజింటికి బయల్దేరాడు. ఇద్దరూ వుండేది గుంటూరులోనే. ప్రొద్దున్నే ఆఫీసు పని మీద వంటూరాగా వెళ్ళినా, రాత్రికి తిరిగి వచ్చేసారు.

గిరిధర్ తనింటికి వచ్చేసరికి, ధనరాజ్ ఒక్కడూ, పడకకుర్చీలో లుంగీ, బనీనుతో కూర్చుని వున్నాడు. ప్రక్కన బల్లమీద సగం ఖాళీఅయిన విస్కీ సీసా, గాజు గ్లాసూ వున్నాయి.

ఇంట్లో, కూతురుకూడా లేనట్లుంది. గిరిధర్‌ని రమ్మని ఆహ్వానించి ఆఫీసు విషయాలు కొద్దిసేపు మాట్లాడాడు ధనరాజు. పీక్కుపోయినట్లున్న అతని మొహం ఆనాడు మరీ నల్లగా, మసిబారినట్లుంది.

'మిమ్మల్నొక విషయం అడగాలను కుంటున్నాను' అన్నాడు కొంచెం సేపు మౌనంగా వున్నాక, గిరిధర్.

'ఏమిటది ?' అని ప్రశ్నించాడు, ధనరాజు ఎటో చూస్తూ.

'మొన్నటి సోదానాడు అంజయ్యకూతురి పెట్లో కన్పించిన ప్రేమ లేఖలే నను కుంటాను. వాటిని మీరంత ఆసక్తిగా ఎందుకు చదివారు.' అని సున్నితంగా, తప్పుచేసిన వారిని మందలించే ధోరణిలో అడిగాడు, గిరిధర్.

ధనరాజ్ కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత, మెల్లిగా 'ఆ వుత్తరాలు శాంతి స్వరూప్‌కీ, సరళకీ మధ్య జరిగిన ప్రేమ లేఖలు' అన్నాడు.

'శాంతి స్వరూపా?' అని గిరిధర్ ఆశ్చర్యపోయాడు. శాంతిస్వరూప్ అంజయ్య కూతురికి ప్రేమలేఖలు రాశాడంటే వాళ్ళిద్దరిమధ్యా అనుబంధం వుందేమో. మరి శశిరేఖ ! బహుశా శశిరేఖతో పరిచయం ఏర్పడకముందు వాళ్ళిద్దరూ ప్రేమికు లేమో. తరువాత సరళకు వివాహం కావడంతో, ఆమెను మరచి శశిరేఖతో స్నేహం చేశాడేమో. 'బహుశా పాత ప్రణయమై వుంటుంది' అన్నాడు.

'కాదు. అవన్నీ ఈమధ్యవే. ఆఖరిలేఖ నాలుగురోజుల క్రింద రాసినది.'

'ఆ ! ఎంత కపటం ! శాంతిస్వరూప్ అలాటివాడనుకోలేదే. అయినా చాలా ప్రమాదకరమైన పనే. ఎప్పుడో ఒకప్పుడు బయట పడితే, ఫలితం దారుణంగా వుంటుంది.'

'జరుగవలసిందేదో జరిగిపోయిందనే నా అనుమానం. మనం సోదాచేసిన రోజుకు ముందురోజు, నంబూరు రైల్వేస్టేషన్‌కు కొంచెందూరంలో రైలుపట్టాలమీద ఒక గుర్తుతెలియని యువకుడి శవం కన్పించిందనీ, పోలీసులు

అది ఆత్మహత్య అని నిర్ణయించారని విన్నాం జ్ఞాపకముందా.'

'అవును ఆ యువకుడెవరో గుర్తు తెలియలేదని అన్నారు' అని మెల్లిగా ఆ విషయం గుర్తుకు తెచ్చుకుంటూ, దానికీ ప్రస్తుతానికీ సంబంధమేమిటా అని ఆలోచిస్తూ, అన్నాడు గిరిధర్.

'ఆ యువకుడు శాంతిస్వరూప్ అని నా నమ్మకం. ఈరోజు మధ్యాహ్నంకల్లా పూర్తిగా నిర్ధారణ అవుతుందని పోలీసు వాళ్లుకూడా చెప్పారు.'

'ఆ! శాంతిస్వరూప్ ఆత్మహత్య చేసుకున్నాడంటారా?'

'అది ఆత్మహత్య కాదు. కేవలం హత్య! దారుణమైన హత్య!'

'హత్యా! నేను నమ్మను. మీకెలా తెలుసు?'

'ఆ వుత్తరాలు చదివితే ఆ విషయం గ్రహించవచ్చు. సరళకు పెళ్ళి అయినా, సరళ శాంతిస్వరూప్‌తో తిరగడమూ, భర్తను లెక్కచెయ్యకపోవడమూ అంజయ్యకు గిట్ట లేదు. కూతుర్ని గట్టిగా దండించలేక, శాంతిస్వరూప్‌ని తన యింటి చాయలకు రావద్దనీ, తన కూతుర్ని కలవొద్దనీ, కలిస్తే బ్రతకవనీ, అంజయ్య హెచ్చరించాడు ఆ విషయంకూడా, శాంతిస్వరూప్ రాసిన ఆఖరిలేఖలో వుంది. అంజయ్యమాట లెక్కచెయ్యకుండా తను వస్తున్నానని వ్రాశాడు మర్నాడు రైలుపట్టాలమీద శవమైయ్యాడు.'

'ఇంత దారుణమా! మీకు ఈ విషయాలన్నీ నమ్మకంగా తెలిసాయా?' అని గిరిధర్, అతనిమాటల్ని నమ్మలేనట్లు అడిగాడు.

'ఆ వుత్తరాలు చదివినదగ్గరనుంచీ, నా మనసు ఏదో కీడు శంకించసాగింది. మొన్న పగలంతా, నంబూరుచుట్టూ తెగ తిరిగి, ఈ ఆరాలన్నీ తీసాను అక్కడ పోలీసు ఇన్‌స్పెక్టరు నాకు బాగా పరిచయస్థుడు. అతనుకూడా కొన్ని వివరాలు చెప్పాడు శాంతిస్వరూప్ స్కూటరు, తుప్పల్లో దొరికింది. పని చాలా పకడ్బందీగా జరిగింది. ఇందులో అంజయ్య ప్రమేయం వుందని పోలీసులకుకూడా అనుమానం వుంది.'

అంజయ్యమీద రిపోర్టు చెయ్యలేమా?' అని గిరిధర్ ఉద్రేకంతో పళ్ళు పటపట లాడించాడు.

'లాభంలేదు. మనం సోదాచేసి ఏం సాధించామో, రేపు కేసు పెట్టినా అదే మిగుల్తుంది. అంజయ్యని ఎవరూ ఏమీ చెయ్యలేరు' అని కొంచెంసేపు మౌనంగా వూరుకున్నాడు. గిరిధర్‌కూడా అతని మాటల్లోని నిజాన్ని గ్రహించాడు.

'మరి మీ అమ్మాయికి విషయం తెలిసిందా?' అని ఆత్రుతగా అడిగాడు గిరిధర్. లేదన్నట్టు, తల వూపాడు ధనరాజు.

'అది వూరెళ్ళింది. బహుశా ఇవాళ సాయంకాలానికి వస్తుంది. ఇంకా కొన్నాళ్ళదాకా దానికి విషయం చెప్పదల్చుకోలేదు' అని కన్నీళ్ళు తుడుచుకున్నాడు. తరువాత బాటిల్‌లోని విస్కీ, కొంచెం గ్లాసులో పోసాడు.

# వెండి అకెటాకు

గిరిధర్ అతని దుఃఖాన్ని అర్థంచేసుకున్నాడు. కూతురికి కాబోయే భర్త హత్య చేయబడ్డాడని తెలుస్తే ఎవరుమాత్రం ఆ దుఃఖాన్ని తట్టుకోగలరు. ధనరాజ్‌ని ఓదార్చే బాధ్యత, 'బాటిల్'కి వప్పజెప్పి, గిరిధర్ బయటికి వచ్చేసాడు.

మర్నాడు అతను మరొక దుర్వార్త వినాల్సివచ్చింది.

ఏ విషయం శశిరేఖకు తెలియకుండా దాచివుంచాలని ధనరాజ్ ప్రయత్నించాడో, ఆ విషయం, ఆమె ఊరినుంచివచ్చిన కొద్ది సేపటిలోనే ఆమెకు తెలిసిపోయింది. అప్పట్నించి ఆమె దుఃఖం వర్ణనాతీతంగా వుంది.

ఆ వివరాలు ధనరాజే గిరిధర్‌కి చెప్పాడు. అని చెప్తూవున్నంతసేపూ, ధనరాజు ముఖంలోని బాధను గిరిధర్ చూడలేకపోయేడు. ఒక చిన్నకుర్రవాడు తను ఎంతో కష్టపడి కట్టుకున్న పేకమేడను పెద్దవాళ్ళు నిర్దాక్షిణ్యంగా కూల్చి నాశనంచేస్తే, వాడు, జాలిగా, భయంగా, తనలోంచి వచ్చే ఏడుపు నణుచుకోవడానికి ప్రయత్నిస్తూ చూసే చూపులా, అప్పుడప్పుడు చూడసాగాడు. అతనిని ఎలా ఓదార్చాలో గిరిధర్‌కు బోధపడలేదు. ధనరాజు, తన కోసం బాధపడటంలేదు; తనకి బాధ కలిగితే 'బాటిల్ వుంది.' కాని' తన కూతురినెలా ఓదార్చాలో తెలియక బాధపడుతున్నాడు.

దుఃఖంతో పూడుకుపోతున్న కంఠంతో ధనరాజ్ చెప్పినదిది.

నరళ, ఆ క్రితం రోజు సాయంత్రం ధనరాజు ఇంటికి ఒక్కర్తె వచ్చిందిట. తన ప్రేమలేఖలు ధనరాజువద్ద వున్నాయనీ, వాటిని ఎలాగైనా అతనిని బతిమాలి తీసుకుందామని వచ్చింది. ఆమెకు శశిరేఖా శాంతిస్వరూప్‌ల వివాహంగురించిగాని, అసలు శశిరేఖగురించిగాని ఏమీ తెలియదు. అసలు వీళ్ళకూ శాంతిస్వరూప్‌కీ పరిచయం వుందనే ఆమెకు తెలియదు.

ఆమె ఇంటికివచ్చిన సమయంలో ధనరాజ్ ఇంట్లో లేడుగాని, శశిరేఖ ఇంట్లోనే వుంది. ఆమె సరళ నాహ్వానించి, ఆమె గురించి వివరాలన్నీ అడిగింది. ముందర ధనరాజ్‌కోసం ఎదురుచూస్తూ ముభావంగా వున్నా, క్రమంగా విషయాలు చెప్ప నారంభించిందిట. సాటి ఆడదికదా అని, తన బాధను పంచుకుంటుందేమోనన్న వుద్దేశంతో, తనకూ ఒక యువకుడికీ చాలా కాలంనుండి స్నేహమనీ, అతను రాసిన ప్రేమలేఖలు, తను యింట్లో బంగారంకోసం సోదా చేసినరోజున, తన పెట్లోంచి ధనరాజ్ తీసేసాడనీ, అవి బయటపడితే చాలా ప్రమాదమనీ, తన కాపురానికేకాక, తన తండ్రికికూడా ముప్పని చెప్పిందిట. అందుకే ధనరాజు నెలాగైనా బతిమాలి, వాటిని తీసుకుందామని వచ్చానంది. ఒకవేళ ధనరాజు, అవి తిరిగి ఇవ్వడానికి సొమ్ము కావాలని అడిగితే, తను అందుకుకూడా సిద్ధపడి వచ్చానందిట.

శశిరేఖ ఒకసారి తండ్రికి వప్పచెప్పి

## సౌందర్యపోషణకై కొన్ని సలహాలు

* కోడి గ్రుడ్డులోని 'చందమామ'ను ముఖానికి రాసుకొని అయిదారు నిముషాల తర్వాత కడిగేసుకుంటూ ఉండాలి. దాని వలన ముఖం అందంగా ముడతలు లేకుండా తయారవడమేగాక మంచి 'రంగు' కూడా వస్తుంది.

* 100 గ్రాములు కొబ్బరనూనెలో 10 గ్రాముల వేపపువ్వు 5 గ్రాములు బెల్లం వేయించి కలిపి ఆ నూనెను తలకు రాస్తూంటే చుండ్రు తగ్గిపోతుంది.

* సానపైన ఏనుగు దంతాన్ని సూరితే పొడి వస్తుంది. ఆ పొడిని వేయించి నల్లగా అయిన తర్వాత నూనెనూనెతో కలిసి వెంట్రుకలు రాలిన చోట్ల మర్దించితే వెంట్రుకలు మొలుస్తాయి. శరీరంలో ఎక్కడైనా సరే వెంట్రుకలు రాలి పోతున్నాయంటే ఇది తప్పకుండా ఉపయోగ పడుతుంది

* మొహం పైనా చేతులపైనా వెంట్రుకల్ని పోగొట్టుకోడానికి స్త్రీలు చాలా యాతనలు పడుతూంటారు. ఇలా చేసిచూడండి:— కొన్ని శనగపిండిలో కొంత నన్నీరు కలిపి ముద్దగా చేసి వెంట్రుకలున్న ప్రదేశంలో రాసి ఆరిన తర్వాత వెంట్రుకల్ని లాగితే తేలిగ్గా వచ్చేస్తాయిట!

* ప్రతి రోజూ ఉదయాన్నే చన్నీళ్ళతో నిమ్మరసం పుచ్చుకుంటే శరీరానికి మంచి కాంతి వస్తుంది ఆరోగ్యపరంగా కూడా చాలా మంచిది.

* లావు తగ్గడానికి చాలా మంది ఉపాయాల కోసం వెదుకుతూంటారు. ప్రతిరోజూ రెండు టీ స్పూనుల తేనెను ఒకగ్లాసు మంచి




నీళ్ళల్లో కలుపుకుని ఉదయాన్నే పుచ్చుకుంటూ ఉంటే లావు తగ్గే అవకాశాలున్నాయి.

* కంటి క్రింది నలుపు చారలుపోవాలంటే రోజూ 'డికాక్షన్‌ను' దూదితో తీసుకుని కంటి క్రింది చార మీద పడేలా అద్దుతూ ఉండాలి. క్రమంగా ఫలితం కనిపిస్తుంది.

—శ్రీరామలక్ష్మినారాయణమూర్తి.

జా వుత్తరాలు తిరిగి ఇప్పించేస్తానని హామీ ఇచ్చింది. తరువాతి మాటలలో సరళ తన ప్రియుణ్ణి గురించి తెల్పుకుంటూ అతనికి తనకూ మొట్టమొదట టెన్నిస్ ద్వారా పరిచయమైందనీ, అతను గొప్ప టెన్నిస్ ఆటగాడనీ చెప్పిందట.

'అయితే మా శాంతికి తెలిసివుంటాడు' అందిట శశిరేఖ.

'శాంతి ఎవరూ?' అని సరళ అడిగిందట.

'శాంతిస్వరూప్ అని నా ఫ్రెండు. నా...' అని శశిరేఖ సిగ్గుతో ఆపితే,

'అతనిగురించేనే చెప్తున్నాను' అందిసరళ.

ముందు నిర్ఘాంత పోయినా, తరువాత తమ యిద్దరికీ ఒకే వ్యక్తి ప్రియుడని తెలుసుకుని, 'అయితే శాంతి... అని ప్రశ్నార్థకంగా, నమ్మలేనట్లు సరళవైపు చూసింది. 'అవును' అని తలూపింది సరళ; మొహం ప్రక్కకు తిప్పుకుని కన్నీరు తుడుచుకుంది.

మరు నిముషంలో శశిరేఖ తెలివి తప్పి పడిపోయింది.

ఆ సమయంలో ధనరాజు ఇంటికి తిరిగి వచ్చాడు అతనికి విషయాలన్నీ సరళే చెప్పింది. శశిరేఖకు శాంతిస్వరూప్ తెలుసునని తెలియక తను అతని సంగతి చెప్పానని చెప్పింది. ఇద్దరూ శశిరేఖకు ఉపచారాలు చేసి, డాక్టర్ని పిల్చుకువచ్చి, ఇంజెక్షనిప్పించి, పడుకోబెట్టారు. డాక్టరు ఆమె నాడిచూసి, ధనరాజుతో ఏదో చెప్పాలనుకొని, 'ఆమెకు వివాహమైందా?' అని అడిగాడుట లేదని చెప్పాక, మరునాడు తన నర్సింగ్‌హోమ్‌కి తీసుకురమ్మని చెప్పి వెళ్ళిపోయాడు. డాక్టరు, మనసులో ఏదో వుందని ధనరాజ్ గ్రహించాడు.

తరువాత, ధనరాజు, సరళతో తానా వుత్తరాలు తేలేదనీ, ఆమె పెట్టెలోనో, లేక అటువంటిదే మరొక పెట్టెలోనో పెట్టానని చెప్పాడుట. అదివిని ఆమె నిర్ఘాంతపోయిందట.

దురదృష్టవశాత్తూ ఆ రెండో పెట్టె, సరళ భర్తదిట. సోదా జరిగిన మరునాడే అతనువచ్చి దానిని తీసుకెళ్ళాడుట ఈ పాటికి ఆ వుత్తరాలు అతనుచూసి వుంటాడనీ, అతనికి అన్నీ తెలిసి వుంటాయనీ, తన సంసారం నవ్వులపాలైనట్లే అనుకుని, ఏడుస్తూ సరళ వెళ్ళిపోయిందట.




అఖండదీపం అంటే ఆరిపోకుండా ఉండే దీపమని అర్థం. దీనికే అనిర్వాణదీపమనిన్నీ పేరు. ఎల్లప్పుడూ ఉండేది కాబట్టి దీనిని అజస్రదీపమనిన్నీ అంటారు. దేవాలయాల్లో గర్భగుడిలో తప్పకుండా ఈ అఖండదీపం ఉంటుంది.

ఈ దీపంవల్ల ప్రయోజనం ఏమిటి?— అనే ప్రశ్నకు అవకాశం లేకపోలేదు.

భగవదారాధన రెండు విధములు. మొదటిది సగుణోపాసన. తర్వాతిది నిర్గుణోపాసన. సగుణోపాసనకు విగ్రహారాధన ఆధారము. మనస్సు పరిపక్వస్థితిని పొందిన తర్వాతగాని నిర్గుణోపాసన సాధ్యపడదు. గర్భగుడిలో మూలవిరాట్టు సన్నిధిలో ఉండే అఖండదీపం నిర్గుణ పరబ్రహ్మకు ప్రతీక అయి, అఖండమైన తేజస్సే పరమాత్మ అని వ్యక్తపరుస్తూ ఉంటుంది.

మరిన్నీ గర్భగుడిలో ఎల్లప్పుడూ అఖండ దీపం ఉండకపోతే చీకటితో నిండి ఉన్న ఆ స్థలంలో మూలవిగ్రహాన్ని చూడడానికే సాధ్యం కాదు.

దేవాలయాల్లో దీపారాధన చాలా ముఖ్యం. దీపారాధనకోసం కావలసిన నేతినిమిత్తం ఆవులు మున్నగు పాడిపశువులను గుడులకు దానం ఇచ్చే శాసనాలు ఎన్నో కానవస్తాయి.

'అహోరాత్ర మనిర్వాణ
దీప మారోపయేన్నరః
సర్వపాప విశుద్ధాత్మా
విష్ణులోకే మహీయతే.'

సాకారపరబ్రహ్మ సన్నిధానంలో సదా ప్రకాశించే దీపాన్ని మానవులు నిలపాలి. అట్లు నిలిపినందువల్ల సమస్తపాపములు నశించి, పరిశుద్ధుడై అంతమునందు విష్ణులోకాన్ని పొంది సుఖించునని— పైది శ్లోకానికి అభిప్రాయం.

'సర్వేషామేవ దేవానాం
దీపః ప్రియతమో భవేత్.'

అని దేవతలందరికిన్నీ దీపమంటే ఎంతో ప్రీతి అని తెలుపుతున్నది.

ఉడిపి శ్రీకృష్ణుని దేవాలయంలో ఎన్నో శతాబ్దాలక్రిందట మధ్వాచార్యులవారు నెలకొల్పిన అఖండదీపమే ఇప్పటికీ అవిచ్ఛిన్నంగా ఉన్నదని చెప్తున్నారు. ●

---

ధనరాజ్ ఈ విషయాలన్నీ చెప్పి వారం రోజులు సెలవు పెట్టి వెళ్ళిపోయాడు. కూతుర్ని ఓదార్చడంకోసం సెలవు పెట్టి వుంటాడనీ, ఆ తండ్రీ కూతుళ్ళనిద్దర్నీ వాళ్ళ మానాన వాళ్ళని వదిలెయ్యాలని గిరిధర్ అటు వెళ్ళలేదు.

నాలుగు రోజులతర్వాత, గుంటూరులో ఉదయ్‌శంకర్ హోటలువద్ద, సాయంకాలం ఆరింటికి, అటే వస్తున్న గిరిధర్‌కు, ఒక నల్లని, కొత్త అంబాసిడరుకారు ఆగడం, అందులోంచి సరళా, ఆమెభర్తా దిగి నవ్వుతూ హోటలు మెట్లెక్కడం కన్పించింది. ఎవరో యిద్దరు యువకులు, మెల్లిగా 'అల్లుడికి కొత్తగా అంజయ్య కొనిచ్చిన కారురా అది' అని అనుకోడం విన్నాడు. అతనికి తన తండ్రి మాటలు గుర్తుకొచ్చాయి.

చీకటి పడుతుండగా, ఇంటికి చేరుకుంటున్న గిరిధర్‌ని రోడ్డుమీద తూలి పోతూ నడుస్తున్న ఒక వ్యక్తి ఆపాడు. అతనివద్ద సారావాసన గుప్పుమంటుంది. అతని బట్టలన్నీ దుమ్ము కొట్టుకుపోయి వున్నాయి. నిలబడలేకుండా ఊగిపోతూ, 'నా కూతురు చచ్చిపోయింది...విషంతాగి... ఏది...విషం...చచ్చి...దాని మొగుడి దగ్గరికి ... స్వర్గం వెళ్ళింది ... స్వర్గానికి ... మొగుడు...' అంటూ చెప్పిందే పదిసార్లు చెపుతూ, గబుక్కున నడి రోడ్డుమీద కూచుని, 'నా కూతురా...' అంటూ ఏడవ సాగాడు. అతను ధనరాజ్ అని పోల్చుకుని గిరిధర్ అచేతనుడై చీకట్లోకి చూస్తూ అలా నిలబడిపోయాడు.

దీపావళి కథల పోటీలో రూ. 500 బహుమతి పొందిన కథ




ఆ ఇంట్లో దిగిన రెండో రోజు నను కొంటాను, తెల్లారుఝామున మెలకువ వచ్చింది. టైము అయిదయిందప్పుడు. కళ్ళు తెరవగానే వాకిట్లోనున్న పక్కింటామె కనిపించింది గుడ్డి వెన్నెలలో ముగ్గులు పెడుతోంది. అందంగా— అమాయకంగా ఉందామె మొఖం. చనిపోయి అయిదేళ్ళవుతోన్న మా పిన్నికూతురు శాంత అచ్చం ఇలానే ఉండేది. పక్కింట్లో ఎవరున్నారో ఇంకా తెలీదు. ఆ ఇల్లు అద్దెకు కుదిరిందని చెప్పే రమణ నన్నాడు.

‘భలేవాడి పొరుగున చేరావులే! శ్రీరామ్మూర్తి అని మనాఫీసులోనే రేంజ్ — (తీలో చేస్తున్నాడు..’ అన్నాడు.

‘ఏమిటి విశేషం?’ అడిగాను.

‘చూస్తావుగా ...’ అంటూ మాట తప్పించేశాడు.

ఆరోజు సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికొచ్చేసరికి పక్కవాటాలోనుంచి ఒక స్త్రీ గట్టిగా ఏడుస్తున్న శబ్దం వినిపించింది. అస్పష్టంగా మొగగొంతుకు అరుస్తోంది. మధ్య తలుపుదగ్గరకెళ్ళి చెవి ఆనించి విన్నాను

‘ఆ పొచ్చపుముండా! చంపేస్తాను — ఇంకోసారి కిటికీదగ్గర నిలబడ్డావంటే? ఆ కిటికీ తీయాల్సిన అవసరమేమొచ్చింది నీకు?’

ఆమెను బలంగా గుద్దిన చప్పుడు వెక్కి వెక్కి ఏడుస్తోందామె. నా మనసంతా అదోలా అయిపోయింది. వెనక్కు నడిచి కుర్చీలో కూలబడ్డాను. ఆమె ఏడుపు సన్నగా వినిపిస్తూనే ఉంది. రకరకాల ఆలోచనలు నన్ను కమ్ముకొన్నాయి

కిటికీదగ్గర నుంచుంటే తప్పేముంది? అంతమాత్రాన కొట్టడమెందుకు? ఒకవేళ ఆమె ప్రవర్తన మంచిదికాదా? ఇంతకుముందేమయినా కథలు నడిపిందా? కాని ఆమెను చూస్తూంటే అలాంటి మనిషిలా కనిపించటంలేదే! బహుశా అతను వట్టి అనుమానపుగొడ్డయినా అయిఉండాలి. మన ఊళ్ళల్లో సాధారణంగా ఇలాంటి రకాలు చాలాచోట్ల కనిపిస్తుంటారు. మర్నాడు మధ్యాహ్నం కాంటీన్‌లో రమణ కనిపించాడు

‘ఓ నిముషం మాట్లాడాలి...’ అన్నాను.

‘శ్రీరామ్మూర్తి గురించేనా?’

‘అవును...’

నవ్వాడు వాడు. ఇద్దరం రికార్డ్‌రూం వెనుక ఉన్న వేపచెట్టు నీడకు చేరుకొన్నాం.

‘వాడు మనిషికాదు. పశువు! పెళ్ళాం మీద అనుమానపురోగం. పెళ్ళయి రెండేళ్ళు కాలేదింకా— ఆ అమ్మాయి దెబ్బలు తినని

రోజులేదు. సినిమాలకీ, షికార్లకీ ఎక్కడికీ తీసుకెళ్ళడు. వాడిమొఖం చూడాలంటేనే నాకు పరమచిరాకు — నేనేకాదు ఆఫీసులో ప్రతివాడూ వాడిని కుక్కలా చూస్తారు.'

'ఈ విషయాలన్నీ నీకెలా తెల్సు?'

'లక్ష్మణరావ్ అనీ మనాఫీసులో గుమాస్తా —ఇంతకు ముందు నువ్వుంటున్న ఇంట్లో అద్దెకుండేవాడు అతనిద్వారా తెలిసినయి'

ఆ మధ్యాహ్నం ఇక పని చేయలేక పోయాను. ఇలాంటి గొడవలువింటే నా మన సంతా పాడయిపోతుంది. వేరే పనిమీద లగ్నంకాదు రెండు రోజులపాటు మళ్ళీ వాళ్ళ గొడవేమీ వినిపించలేదు నాకు ఆమె కూడా బయట కనిపించలేదెప్పుడూ.

ఆరోజు ఆఫీసులో ఫైల్స్ చూసు కొంటూండగా 'మాష్టారూ!' అన్న పిలుపు వినిపించి తలెత్తి చూశాను.

ఎదురుగా శ్రీరామ్మూర్తి నుంచుని ఉన్నాడు. అతని కళ్ళు ఎర్రగా తాగినవాడి కళ్ళలా ఉన్నాయి. గడ్డం మాసి ఉంది. క్రాఫ్ సరిగ్గా దువ్వలేదు.

'ఏమిటి?' అడిగాను సీరియస్ గా ఏంచేతో అతనితో సరిగ్గా మాట్లాడాలని పించలేదు.

'రత్నగిరి ఫైల్ మీదగ్గరుందటగదా? ఒకసారిస్తే ఇన్ ఫర్ మేషన్ నోట్ చేసుకొని తిరిగిచ్చేస్తాను.'

'ఇప్పుడు నాకు పనుంది. రేపు రండి... చూస్తాను...' అన్నాను నిర్లక్ష్యంగా. ఎందు కనో అతన్ని అవమానించాలనీ, హింసించా లనీ అనిపించింది నాకాక్షణంలో

'అలాగేనండీ!' అంటూ వెళ్ళిపోయా డతను. మాసిపోయి, అతుకులుపడిన బట్ట లున్నయి అతని వంటిమీద

ఆ మర్నాడు అతను వచ్చినప్పుడుకూడా చాలాసేపు నుంచోబెట్టి తరువాత ఫైల్ ఇచ్చాను. ఆ సాయంత్రం అతని గురించి ఆలోచిస్తే నేను చేసిన పని నాకేమంత నచ్చలేదు. అతన్ని అవమానించడానికి నేనెవర్ని? ఆ రాత్రి మళ్ళీ ఆమె ఏడుపు అతను కొట్టేదెబ్బలు స్పష్టంగా వినబడినయి. తెల్లవారేవరకూ నిద్రపట్టలేదు నాకు. అతనసలు ఎందుకలా మారాడో అర్థంచేసు కోడానికి చాలాసేపు ప్రయత్నించాను. కానీ తగిన కారణమేమీ కనిపించలేదు. బహుశా భార్య అందమయిన స్త్రీకావడంవల్లనేమో అనిపించింది. పైగా ఆఫీసులో మా — బయటాకూడా అందరూ అతన్ని వెలివేసి నట్లు చూడటం మరో కారణం కావచ్చు. అందుమూలాన అతను మరింతగా అడవి మృగంలా మారేందుకు అవకాశం ఉంది గట్టిగా ప్రయత్నిస్తే అతనేమయినా మని షిలా మారేందుకు వీలుంటుందేమో!

శాయశక్తులా ప్రయత్నించి అతన్ని మామూలు మనిషిగా మార్చడానికి నిశ్చ యించుకొన్నాను. అందరితోపాటు అతన్ని వెలివేయడం చాలా తేలిక. కాని దానిమూలాన జరిగే మేలేమీలేదు.

మర్నాడు ప్రొద్దున అతను ఆఫీసుకి బయల్దేరటం చూసి నేనూ అతన్ని వెంబ డించాను. పక్కన నన్ను చూసి 'హలో' అని పలుకరించాడతను.

'ఆఫీస్ కేనా?' అడిగాను.

అవునంటూ తలూపాడతను. అతన్ని మెల్లగా సంభాషణలోకి దించాను. ఆఫీస్ కి సంబంధించిన విషయాలు మాట్లాడు కొంటూ ఇద్దరం ఆఫీస్ చేరుకొన్నాము. ఆరోజు మధ్యాహ్నం అతని టేబుల్ దగ్గర కెళ్ళి 'కాంటీన్ కొస్తున్నారా?' అనడిగాను.

'ఓ! ఇప్పుడే! ఒక్కక్షణంలోవస్తాను.' అంటూ ఫైళ్ళు సర్ది లోపల ఉంచి నాతోపాటు బయల్దేరాడతను.

ఇద్దరం కాఫీలు తాగాం

'గంటలోపల నాలుగుకేసుల రిపోర్టు ఇమ్మంటాడు హెడ్ క్లర్క్! అదెట్లా కుదురుతుంది చెప్పండి! ప్రాణం తీస్తున్నాడు ..' బాధగా అన్నాడతను.

'వాడి మొహం! మీ టైమ్ మీరు తీసుకొని మెల్లగా చేయండి...' అన్నాను.

అతను కృతజ్ఞతా పూర్వకంగా నావంక చూశాడు.

హెడ్ క్లర్క్ దురాగతాలు కొన్ని ఏకరువు పెట్టాడు.

మాట్లాడుతూన్నప్పుడు మధ్య మధ్య కొద్ది క్షణాలు మాట్లాడకుండా ఆగిపోవటం గమనించాను బహుశా ఆ కాసేపు భార్య గురించే ఆలోచిస్తూండి ఉండవచ్చు. భార్యఇంట్లో ఒక్కర్తే ఏం చేస్తోందో? ఎవరి వంకయినా చూస్తోం దేమోనని నవ్వుతోందేమో అన్న విషబీజాలు అప్పుడే నాటుకొంటయ్యనుకొంటాను

ఆ సాయంత్రంకూడా ఇద్దరం కలిసే ఇంటికి వెళ్ళాం. వారం రోజుల్లోగా మా స్నేహం చాలా వృద్ధయింది. ఇద్దరం ఒక రోజు సినిమాకికూడా వెళ్ళాం. అయితే సినిమాకెళ్ళేప్పుడు భార్యని ఇంట్లో ఉంచి తలుపులు తాళాలేసి బయల్దేరాడతను షాక్ తగిలినట్లయింది నాకు అతని ప్రవర్తన చూసి. మరీ ఇంత అనుమానమా? బహుశా నీడింక మారడేమో అనికూడా అనిపించింది.

సినిమాలో హీరో హీరోయిన్ని అపార్థం చేసుకొని అనుమానించి వదిలేస్తాడు. అది చూసున్నప్పుడు అతని మొహంలోకి చూశాను పాలిపోయింది సినిమానుంచి ఇంటికొచ్చేటప్పుడు నెమ్మదిగా సినిమా విష యం కదిపాను.

'భార్యని అలా అనుమానించడానికి సిగ్గుండాలి ... వాడు మనిషికాదు ...' అన్నాను.

'అవును...' అన్నాడతను ఖంగారుగా.

'నాకలాంటి వాళ్ళనిచూస్తే అసహ్యం! భార్యంటే మన జీవితమంతా మనతో కలిసి ఉండి—అన్నిటినీ సమానంగా పంచుకొనే మనిషి —ఆమెను నమ్మలేకపోతే ఇక అనవ సరం—ఇద్దరూ విడిపోవడం మంచిది.'

అతనేమీ మాటాడలేదు. మౌనంగా నడిచాడు ఇంటివరకూనూ!

ఆ తరువాత నాలుగు రోజుల వరకూ ఆమె ఏడుపు వినిపించలేదు. అతనిలో కొంత పరివర్తన వచ్చి ఉంటుందను కొన్నాను. అదిమొదలు వదలకుండా అతని వెంట తిరగడం మొదలు పెట్టాను. ఇద్దరి మధ్యా సన్నిహితత్వం పెరిగిపోయింది. తన గురించి చెప్పుకొన్నాడతను ఒకరోజు.

'చాలా బీదకుటుంబం మాష్టారూ మాది. మా ఊళ్ళో తల్లి తండ్రి ఇద్దరు చెల్లాయిలూ ఉన్నారు. ప్రతినెలా నేను డబ్బు పంపాలి ఇంటికి. లేపోతే వాళ్ళకు గడవడం కష్టం. చెల్లాయికి పెళ్ళికూడా నేనే చెయ్యాలి...' అతన్నిచూస్తే మొదటి సారిగా జాలి కలిగింది నాకు.

'నేను ఎప్పటినుంచో మిమ్మల్నో విషయం అడగాలనుకొంటున్నాను!' అన్నాను నెమ్మదిగా.

'అడగండి!' అన్నాడతను పొడిగా.

బహుశా నేనడగబోయేది ఊహించి ఉండవచ్చు.

'రోజూ మీ ఇంట్లోంచి కేకలు విని







## సమస్య

పిస్తూంటాయి. మీ ఇద్దరికీ అంతగా పొత్తు కుదరదనుకుంటాను...'

అతను కొద్దిక్షణాలు మాట్లాడ లేకపోయాడు.

'మీరు అన్నది నిజమేనండీ! మా యింట్లో జరిగే అల్లరంతా మీకు వినబడుతోనే ఉండవచ్చు...'

అతని కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయి. ఆవేశంగా మాట్లాడసాగాడు హటాత్తుగా.

'అది...నా భార్య ప్రవర్తన మంచిది కాద్సార్...నేను చాలా మామూలు మనిషిని చిన్నప్పుడు తినడానికి తిండికూడా లేకుండా పెరిగానండీ — ఒకోరోజు ఆకలితో అలమటించి పోయేవాణ్ణి. పస్తులున్నప్పుడుకూడా ఎప్పుడూ నేను దొంగతనం చేయలేదు. చేయడానికి చాలా అవకాశాలు ఉండేవి నాకు. కాని నాకు నీతిమీద అభిమానం ఎక్కువ. ఆ గుణం ఎలా అబ్బిందో నాకే తెలీదు. నా వివాహం అయేముందు ఎన్నో కలలు కన్నాన్సార్! నాభార్య అందంగా ఉండాలనీ, నన్నమితంగా ప్రేమించాలనీ, ఇద్దరం మూడుపూవు లారుకాయలుగా జీవితం గడపాలనీ—చాలా చాలా దురాశపడ్డాను. కాని దేముడు మరోరకంగా చూశాడు...'

అతని గొంతు గద్గదికమయిపోయింది.

'నేనింతవరకూ ఎవ్వరికీ చెప్పలేదు సార్! చెప్పకూడదనే అనుకొన్నాను. ఈ రహస్యం నాతోనే సమాధి అయిపోవాలని కూడా అనుకొన్నాను. అందుకే అందరూ నన్ను అనుమానించారు. కసాయివాడినని, అనుమానప్పుగొడ్డునని ప్రచారం చేశారు. సహించాను... చాలాకాలానికి మీరు నా మనసుకి దగ్గరయ్యారు. బహుశా నన్నర్థం చేసుకోవాలంటే అది మీ ఒక్కరివల్లనే అవుతుంది...

'మా పెళ్ళయి వారంరోజులవుతుంది. నేను ఇక్కడ కొత్తగా కాపరం పెట్టాను. ఓరోజు ఎందుకో ఆమె పెట్టె వెదికాను. లోపల ఆమె అంతకుముందు జరిపిన ప్రేమ కథలు ఉత్తరాల రూపంలో ఉన్నాయి. నా గుండె ఆగిపోయినట్లయింది. వెంటనే పిలిచి ఉత్తరాలు చూపించి ఇదేమిటని అడిగాను.

'పెళ్ళికాకముందు అతనూ నేనూ రాసుకొన్న ఉత్తరాలు' అని జవాబు చెప్పింది,



# అధిక పుష్టినిచ్చే
# బ్రిటా బిస్కట్లు తక్కువ ధరకు
# ఎక్కువ బిస్కట్లు



బ్రిటానియా బ్రిటా బిస్కట్లలో నిండుగా పిల్లలకు పుష్టినిచ్చే పదార్థాలున్నాయి. అవి ఎంతో పసందుగా కూడా వుంటాయి ఈ చిన్న చిన్న బిస్కట్లను మీరెంతో ప్రీతితో తినగలరు. పైగా తక్కువ ధరకే ఎక్కువ బిస్కట్లు లభిస్తాయి.

## బ్రిటానియా
## బ్రిటా బిస్కట్లు

భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు 


BBC-276P

నాకు వొళ్ళు మండిపోయింది. రక్తం ఉడికి పోతున్నట్లనిపించింది. భార్య మరో మగాడితో ప్రణయం జరిపే కథలు కొన్ని నేను హైస్కూల్ రోజుల్లో సెక్స్ మాగజైన్స్‌లో చదివాను. అప్పుడవి సరదాగానే ఉండేవి. కాని నా విషయంలో జరిగేసరికి పిచ్చెక్కినట్లయింది నాకు.

'నాకీవిషయం ఇంతవరకూ ఎందుకు చెప్పలేదు?' అడిగాను కోపంగా.

ఆమె ఏమాత్రం భయపడలేదు.

'మీకు చెప్పే అవకాశం రాలేదు...' అంది తాపీగా.

'వాడెవడితోనో ప్రేమకలాపాలు జరిపి నన్నెందుకు పెళ్ళిచేసుకొన్నావ్?' అనడిగాను కోపం అణుచుకొంటూ.

'మా ఇంట్లో వాళ్ళు ఒప్పుకోలేదు, అతన్ని చేసుకోడానికి...' అంది,

ఆ రాత్రంతా ఆమెతో మాట్లాడలేదు. ఆలోచిస్తూ గడిపేశాను.

'వివాహం అయిపోయింది. ఇప్పుడింక చేయగలిగిందేమీ లేదు. ఆమెకి నచ్చజెప్పి అతన్ని మర్చిపోయేట్లు చూడాలి, అని నిశ్చయించుకొన్నాను.

ఉదయం ఆమెని కూర్చోబెట్టి వివరంగా చెప్పాను. తప్పులనేవి ఎవరయినా చేస్తారనీ, ఇప్పుడింక ఎవరూ ఏమీ చేయలేని స్థితిలో ఉన్నాం గాబట్టి, ఆవిషయం పూర్తిగా మర్చిపోవాలని—ఇంకెప్పుడు అతని కలలోకూడా తల్చుకోకూడదనీ—

'అంతా విని సరేనంది. ఆమెకు వచ్చిన ఉత్తరాలన్నీ చింపి పారవేశాను. పీడ విరగడయిపోయిందని సంతోషించాను... కానీ మరో పదిహేనురోజులతర్వాత ఓరోజు నేను ఇంట్లో ఉండగా అతనిదగ్గరినుంచి మరో

# నమస్కా

ఉత్తరం వచ్చింది. చింపి చదివాను ఈ పది హేనురోజుల్లోగా రెండుసార్లు అతనికి ఉత్తరాలు రాసుకొన్నట్లు ఉందందులో నన్నెంత త్వరగా వదిలేస్తే అంత మంచిదనీ — ఇద్దరూ రిజిష్టర్‌మారేజ్ చేసుకోవచ్చనీ రాశాడతను

'మొదటిసారిగా రాక్షసుణ్ణయ్యాను ఆరోజు. మాట ఇచ్చి మోసంచేసింగన్న కోపంలో ఆమెని ఇష్టమొచ్చినట్లు కొట్టాను. గోడకు కొట్టుకొని తలకు గాయమయింది. ఆరోజంతా ఏడుస్తూనే ఉంది. రెండ్రోజులవరకూ నేను మాట్లాడలేదామెతో ఎప్పటికయినా తనేవచ్చి 'తప్పయిపోయింది, క్షమించమని' అడుగుతుందేమో నని వేయికళ్ళతో ఎదుర్చూశాను. అలాంటి ప్రయత్నమే కనిపించలేదు, మా ఇద్దరి మధ్యా భార్యాభర్తల సంబంధం ఆరోజుతోనే నశించిపోయింది

'చాలారోజులు యంత్రాల్లా గడిపాము ఇద్దరం.'

'ఓరోజు నేను భోజనం చేస్తుండగా వచ్చి 'మీతో కొంచెం మాట్లాడాలి!' అంది నెమ్మదిగా.

'ఏమిటి?' అన్నాను సౌమ్యంగా.

'అతను నిన్న మళ్ళీ ఉత్తరం రాశాడు'

'ఏమని?'

'మిమ్మల్ని వదలి వచ్చేయమని...'

'వెళ్ళిపో...'

'వెళ్ళానికి సిద్ధంగానే ఉన్నాను కానీ ముందుగా మనం కోర్టుద్వారా విడిపోవాలి'

'అక్కడితో నాకు కోపం ఆగలేదు. గొడ్డుని బాదినట్లు బాదానామెని. ఆరోజు నుంచి ఆమెను చూసినప్పుడల్లా నాకు వళ్ళంతా కంపరమెత్తిపోతున్నట్లని పిస్తోంది. అవమానం ఏ క్షణాన్న ఇంట్లోంచి పారిపోతుందోనని భయం! అందుకని ఆఫీసకెళ్ళినా ఎక్కడికెళ్ళినా తాళం వేసి వెళ్తుంటాను...'

'అదండీ విషయం. ఇందులో నా తప్పేమిటో — నేనేం చెయ్యాలో — మీరు చెప్పండి...' ఇంచుమించుగా ఏడుపు మొగంతో అన్నాడతను.

నాకు మనసంతా అదోలా శోకం అయి పోయింది ఇలాంటి భార్యలుంటారని నేను అంతవరకూ అనుకోలేదు అప్పుడు కూడా నాకు నమ్మకం కుదరటంలేదు. కానీ ఆ అమ్మాయి అంత మొండిగా ఉన్నప్పుడు విడాకు లివ్వడమే మంచిదనిపించింది. మనసు లేనిదానితో కాపురం చేసేదానికంటె ఒంటరిగా బ్రతకటంలోనే సుఖముంది.

'అలాంటప్పుడు విడాకులిచ్చి పారేసి మళ్ళీ పెళ్ళి చేసుకోరాదూ?'

'ఆలోచించానండీ! అలాగే చేద్దామనుకొన్నాను కాని అగంత తేలిగ్గాదండీ — మా చెల్లాయికి వచ్చే సంబంధాలు కూడా వెనక్కి పోతాయేమో దాని మూలాన — అందుకనే ఏమీ చెయ్యలేక పోతున్నాను...'

'మరి ఆమెను కొట్టి హింసించటంవల్ల ఏమిటి కొట్టినంత మాత్రాన మనసు మారదని మీకు తెలీదా?'

'అది నా చేతుల్లో లేదండీ...ఒకోసారి నాశనమయిన నా జీవితం — నా జీవితం గురించి నేనుకన్న కలలూ — అన్నీ గుర్తొస్తాయి. దీనికంతకూ కారణమయిన నా భార్య ఎదురుగ్గా కనబడుతుంది — అంతే నేనేం చేస్తానో నాకె తెలీదు ఏదోకవక కారణంతో నాలో శక్తి నశించేవరకూ కొడతాను...'

'మీరు ఈ సమస్యని చాలా తెలివిగా పరిష్కరించాలి. మీరు చదువుకొన్న వాళ్ళు అంచేత అలాగే ప్రవర్తించండి లేపోతే చాలా నష్టపోతారు...'

ఆ తరువాత అతను నాకు కనబడటం మానివేశాడు నెలరోజులు గడిచిపోయినయి. వీధంతా గందరగోళంగా వుంది. ఓరోజు నేను నిద్రలేచేసరికి. నిద్రకళ్ళతోనే బయటకు పరిగెత్తాను.

శ్రీరామ్మూర్తి ఇంటిచుట్టూ జనం మూగిఉన్నారు.

అందర్నీ తోసుకొని లోపలకు పరి

నేను నక్సలైట్‌ని కాదు!
ఈయనా! నేను ఎన్.జి.ఓ. ఆఫీసర్ని!

గెత్తాను. అప్పటికే అంతా ముగిసిపోయింది. వాళ్లోనే కిర్సనాయిలు పోసుకొని నిప్పంటించు కొన్నాడతను. పూర్తిగా కాలిపోయింది శరీరం.

అతని భార్య దూరంగా నుంచుని కళ్ళనిండుగా నీటితో శవంవంకే చూస్తోంది. దూరంగా టేబుల్ మీద కాగితం చూస్తున్నారు కొంతమంది. పరుగెత్తి నేనూ చూశాను.

'నా సమస్యకిదే పరిష్కారం. నేను చావడానికెవ్వరూ బాధ్యులు కారు' అని ఉంది. ●

---

# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి

**పి. వి. ఆర్, గజపతి నగరం**

రామలక్ష్మిగారూ, మన నాయకులను సామాన్య ప్రజలనుకూడా సినిమాలలోను, నాటిక నాటకములలోను కథలలోను ఎన్ని విధాలుగా వారు చేసిన లోపాలను ఎంత గట్టిగా విమర్శించినా వారియొక్క లోపాలను వారు సరిదిద్దుకొని పోకుండుటకు కారణం ఏమంటారు?

మానవనైజం. ఆ మారవలసినది మరలవలసినది 'తను' అని అనుకోక— 'పైవాడు'నే అనుకుంటాడు.!!

**ఎన్. ఎస్. ఆర్, తిరుపతి**

నీతి నిజాయితీగా వుండే ఉద్యోగస్తులను పీడించే అధికారులను ఏమనాలి?

పాపం వారినెందుకండీ ఆడిపోసుకోవడం— వారిని పీడించే పెద్ద చేపలుంటాయికదా!

**ఇ. ఎస్. నిజామాబాదు**

మీరు 'వంటింట్లో మగవాడు' బాగా అనుభవంమీద రాసినట్లున్నారు...

బాగా కనిపెట్టేరే— మీకు అలవాటు లాబోలు! అవునా?!

**బి. టి. ఎస్, ఒంగోలు**

కొందరెందుకండీ అంత విరుద్ధంగా వుంటారు?

అవునవును. ఎంత విరుద్ధం అంటే— వారెప్పుడూ వారితో ఏకీభవించరు!

**ఎస్. పి. ఎమ్. ఆర్, రాజమండ్రి**

వంట వచ్చు. ఇక పెళ్లెందుకు?

రుచి ఎవరు చూస్తారుట?!

జవాబులిచ్చే ఆ రామలక్ష్మికే పనిలేదు. ప్రశ్నలు అడిగే మీకూ పనిలేదు అనేవారికి మీ సమాధానం.

మనం అన్ని ప్రశ్నలకీ సమాధానం చెప్పాలని రూలెక్కడుందండీ!

మీకు సన్సు లేరట పాపం. రానేంటి?

అప్పుడే ఏం తొందర?! చచ్చాక కదా కొడుకు అవసరం? అనాథ ప్రేతసంస్కారానికి మీకో ఛాన్సు ఇవ్వాలనే కొడుకుని కనలేదు. కబురంపుతా. వోపిక పట్టుబాబూ.

**డి. ఎస్. కె, మద్రాసు**

రాత్రంతా మేల్కొని చదివినా...పరీక్షలో విజయం సాధించలేకపోయాను—ఎలా?

అయ్యో సుధాకర్ విజయం సాధించడానికి రాత్రంతా మేల్కొని వుండడం దేనికి. పగలు మెలకువగా వుంటే చాలు!

**ఏ. ఎస్. ఎన్, మద్రాసు**

చిత్తుగా ఓడిపోతుంటేకూడా ధైర్యం చెప్పేవాళ్ల నేమనాలండీ, నాకలాంటివాళ్ళని చూస్తే ఒళ్లు మండిపోతుంది.

అలా . . . పరిస్థితులు 'తనకి' అనుకూలిస్తున్నప్పుడు వోడిపోతున్న 'నీకు' ధైర్యం చెప్పేవాడే బాబూ ఆశావాది అంటే— అలాంటి వారినుండి మనం గుణపాఠాలు నేర్చుకోవాలేగాని కోపం తెచ్చుకోకూడదు.

**జి. వి. కె, బెంగుళూరు**

మీరు మీ విమర్శకులతోటే, మిమ్మల్ని తిట్టేవారితోటేకూడా ఎలా మాట్లాడ కల్గుతారండీ, నాకు ఆశ్చర్యంగా వుంటుంది.

మన అభిప్రాయాలు బేధించవచ్చును గాని అంతమాత్రంచేత మనం విబేధించ నక్కరలేదని— నమ్ముతాను నేను. అంచేత మాట్లాడ కల్గుతాను.

**వి. ఏ. ఎస్. ఆర్, విశాఖపట్నం**

మాట్లాడితే వాడో 'హై బ్రో' అంటుంటారు కొందరు. అంటే ఏమిటి?

తన తెలివికి మించి చదువుకున్నవాడు అని అర్థం చెప్పుకోవచ్చు!

**ఆర్. పి. యు, అంపలాం**

స్త్రీ, పురుషునివద్ద ఎంత ఓర్పుతో మెలగాలి?

ఓర్పుతో కాదు— నేర్పుతో.

**వి. ఎస్. ఆర్, విశాఖపట్నం**

మనిషికి విలువలు పెంచేది ఏమిటి?

ఇంటా— బయటా అతని ప్రవర్తన.

**వి. ఎన్. ఆర్, గుంటకల్లు**

భర్త అన్న పదానికి అర్థం బంధాలు. మరి భార్య అన్న పదానికి?

బంధం!!

**పి. జె. ఎస్, కాన్పూరు**

'లేడీ' అంటే నిర్వచనం ఏమిటండీ?

పై వాళ్లని జ్ఞాపకం పెట్టుకుంటూనే— తనని తాను ఎన్నడూ మరువని ఆడది.

రాజకీయవేత్త?

ప్రమాణాల వ్యాపారి!!

కాలం అంటే?

జీతం రోజుకీ జీతం రోజుకీ— మధ్యన వుండే జాప్యం!

**ఎ. డి. పి. ఆర్, పాలకొండ**

పిరికివాడు జీవితాన్ని ప్రేమిస్తాడు. గుండె కలవాడు ప్రేమను ప్రేమిస్తాడు. త్యాగాన్ని ప్రేమిస్తాడు. మరి మీరు?

జీవితాన్ని!

**టి. ఆర్. బి, టెక్కలి**

ఒకసారి మాటమాట పెరిగి నా ప్రేయసిని రెండు తిట్టాను. అప్పటినుంచి నాతో మాట్లాడ్డం మానేసింది.

మంచి పని చేసింది రాంబాబూ, ప్రేయసినే తిట్టిన వాడివి రేపు పెళ్లాన్నయితే కొట్టవని గ్యారంటీ లేదని తెలుసుకుని వుంటుంది!

**కె. పి, గోనేగండ్ల**

అక్కయ్యా, ఈ కరువుకాలంలో మీ ఋట్టాసురుడి కడుపు నిండడం లేదేమో కదూ?

మహారాజులాగా నిండుతోంది సోదరీ, ఎటొచ్చీ మానవమాత్రురాలనైన నాకే ఆకలి తీరడం లేదు.

**జి. పి. ఆర్, హనుమకొండ**

సినిమాలు చూస్తే చదువుకొనే పిల్లలు పాడుఅవుతారని పెద్దవాళ్లు అంటున్నారు. నిజమా? కాదా? మరి వాళ్ళు సినిమాలు చూడకుండా వుండకలరా?

మేం ఎలాగా చెడిపోయాం, మీరు కూడా చెడిపోకండి మా అనుభవం నుంచి గుణపాఠాలు నేర్చుకోండి— అంటారు పెద్దలు. కాని కుర్రకారుది ఉడుకు నెత్తురు కదా! 'మీ అనుభవాలు మీవి. మమ్మల్ని స్వంతంగా అనుభవజ్ఞులని కానివ్వండి' అంటారు. ఇద్దరిదీ తప్పులేదు! కాని నన్ను అడిగితే— తాము అనుసరించలేని మార్గాన్ని ఇతరులకు చూపడం— పెద్దలదే తప్పు.

**బి. హెచ్. కె, నాగర్‌కర్నూలు**

మంది మాటను విని తను కట్టుకున్న భార్యను నడిరోడ్డుమీద అవమానించే వ్యక్తికి అసలు ప్రేమానురాగాలు వుంటాయంటారా? స్నేహితుల సలహాలనే పాటించే వ్యక్తికి అసలు వ్యక్తిత్వం వుందంటారా?

(1) నడిరోడ్డుమీద పెళ్లాన్నిగాని మరే స్త్రీని గాని అవమానించే వ్యక్తికి— సభ్యత లేదు. (2) కట్టుకున్న పెళ్లాన్ని అవమానించే వాడికి అనుమానమే గాని ప్రేమ అనురాగం ఉండవు. (3) ఇక స్వంత అభిప్రాయంలేని వ్యక్తి— వ్యక్తి కాదు. తప్పో ఒప్పో ఒక అభిప్రాయం యేడిస్తేనే— ఒక వ్యక్తిగా చూడొచ్చు.

కోడల్ని తెచ్చి మరింత సుఖపడిపోతున్న సమయంలో, పెళ్ళాడిన మృణాళినైనా తన పక్షాన వుంటుందను కున్న చంద్రశేఖరం ఆశలు అడియాశలై పోతాయి. తల్లికూతుళ్ళకి తాళమేసే మృణాళిన్ని ఏమీ అన లేడు! 'వనమోహిన్ని' చాటుమాటున వరించిన 'పతి' అన్నివిధాలా తనదాన్ని చేసుకుని గజలక్ష్మి దృష్టిలో పెద్ద హీరో అయిపోతాడు. రాజశేఖరాన్ని ధిక్కరించి—అల్లుడికి తమ ఇంట—మొగవారికింతకు ముందు జరగని మర్యాదల్ని జరిపిస్తూంటుంది ఆఖరుకి భర్తగారి రాబోయే ప్రావిడెంటు ఫండుతో స్కూటరుకొనివ్వెయ్యాలని, భర్తని రాచిరంపాన పెడుతూంటుంది.

తండ్రిద్వారా తల్లికి 'చెల్లిమొగుడికి బుద్ధి' చెప్పించాలనుకున్న —చంద్రశేఖరం ప్రయత్నాలన్నీ అతడి పెళ్ళాం ద్వారా నిష్ఫలమవుతాయి. తండ్రీ కొడుకులు ఒక మంచిరోజున యాత్రాస్పెషల్లో పరారైపోతారు. అల్లుడు తన ఆటలు కట్టేక— ఉద్యోగం కోసం బయలుదేరుతాడు. అతనితోపాటు వనమోహినీ వెళ్ళిపోతుంది. అప్పటి తమ స్థితికి తెలివి తెచ్చుకున్న గజలక్ష్మి పశ్చాత్తాపంతో 'మారు తుంది.' కోడలుపై పరాయి మొగాడి అత్యాచారంతో మరింత మంచితనం వస్తుంది. ఆ శుభదినాన కాశీలో తమగాడిద బ్రతుకుల్ని వదిలిన—తండ్రీ కొడుకులు ఇంటికొస్తారు. కథల్లో, యమ్మెల్యేని, వాస్తవంగా చూపించేరు రచయిత ఆర్థిక బాధలకు లోనైన స్త్రీలకి సహాయం చేస్తున్నట్లు నటించే వంచకు లను ఎత్తిచూపేరు. పరాయివారు సంపాదిస్తుంటే

# పుస్తకాలు

రాజావారి 'ఏనుగు'లాగా మేసే పతిని బాగా చిత్రీకరించేరు. హాస్యం సునిసితంగా వుంది. కాని 'మృణాళిని స్త్రీ, పరాయి పురుషుడు?. . . . ఆకలితోను, అయిష్టంతోను వున్న ఆడది. ఆ మాత్రపు స్పర్శకి సరిస్తుందా?' (294వ పేజీ) పాఠకులను నవ్విస్తూ చదివించే నవల యిది.

* * *

రాఘవేంద్రరావు భార్య 'సుజాత'ని, భర్త పోయిన దిగులుతో వుండగా, 'కళ'అనే అందాల భామను వెంట బెట్టుకొచ్చిన వెంకు, ఆవిడ చేతిలో నో ఫోటో వుంచు తాడు. 'కళ' చెప్పింది వారు నన్ను పెళ్ళిచేసుకున్నా రని సుజాత తెల్సుకున్న 'సేతు' కళ— ఎవరు? ఏమిటి అన్న అంశాలమీద ఆరా ప్రారంభిస్తాడు— మరో ప్రక్క అతన్ని ప్రేమించిన 'తార పూల పిల్లకి' చదువుచెప్పే సేతు మనసు తెలుసుకోవ టానికి స్నేహితురాలి ద్వారా అనవసర ప్రయత్నంచేసి అల్లరిపాలవుతుంది. కుమార్ తారని పొందటానికి విఫల ప్రయత్నం చేస్తాడు. అప్పుడు సేతు పెళ్ళి తారను రక్షిస్తాడు. ఆమె మనసు మారుతుంది. సుజాతగారి మేనజర్నెవరో చంపేస్తారు. ఆ స్థానంలో వున్న వెంకుని పోలీసులు అరెష్టు చేస్తారు. కళ డాన్సుచేసే క్లబ్బు నుంచి నిజం తెలుసుకుని వచ్చిన సేతు.... కళతో మాట్లాడుతున్నప్పుడు అక్కడున్న ఫోటోని బట్టి— తను— వాళ్ళ చెల్లెల్ని గ్రహించిన 'కళ' హాయిగా విషం త్రాగి చచ్చి పోతుంది. —తార పెళ్ళితో కథ ముగుస్తుంది. మళ్ళీ కను సేతు పెళ్ళాడాలని నిర్ణయించుకుంటా డప్పుడు.

ఈ రచనలో 'ఉత్కంఠతగాని— ఉత్సాహం గాని మచ్చుకి' కనపడవు. చిల్లర సినిమాల ధోరణి. నైట్ క్లబ్బుల సందడి— దండిగా వున్నది. నవల మొత్తం లో ఏ పాత్రా మనసుకి పట్టదు. ముందు రచనల్ని బాగా వ్రాయాలన్నా వీరికింకా కృషి అవసరం. 'కాగితంపులి' పేరు అతకదు కళ అనే కాగితం పులిలో పాఠకుడికి ఏమీ కనిపించదు.

—కృష్ణ.

# ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

చిట్టివాడైనా గట్టివాడు అని అనిపించుకున్న వ్యక్తి లాల్ బహదూర్. గద్దెనెక్కి కొద్దికాలమే దేశ మేలినా మరపురాని ఘంఘటనల్ని భారతీయుల మనసుల్లో నిల్పిన వ్యక్తి శ్రీ శాస్త్రి. ఆయన మరణంతో. దేశం ఒక మాణిక్యాన్ని కోల్పోయిందే అని సంతాపం ప్రకటించిన వ్యక్తుల్ని మనమెరుగుదుము అట్టి వ్యక్తులే ఇంత త్వరగా ఆయన్ని మరచిపోవుట గర్హనీయము, శోచనీయము.

2వ అక్టోబర్‌నాడు ఏ పత్రికా ఆయన జయంతి గూర్చి వ్రాయలేదు. ఏ రాజకీయవాదీ లాల్ బహదూర్ జన్మదినాన్ని జ్ఞాపకం చేసుకోలేదు. పాకిస్థాన్ మీద ఘనవిజయాన్ని సాధించిన తర్వాత, తాష్కెంట్ లో కన్నా 'నా ప్రజలేమనుకుంటున్నారు' అని భార్యని అడిగి, భారతీయుల క్షేమాన్ని మరణించే క్షణంవరకూ కోరుకున్న వ్యక్తి జన్మదినం జరుపు కోను నోచుకోని భారతీయులు నిజంగా దురదృష్ట వంతులు. భారతీయుల ఉదాసీనస్వభావానికి పరలోక మందున్న శాస్త్రిగారు తప్పకుండా సంతోషిస్తారు.

విద్య, కౌసల్య, భారతి, విజయకుమార్,
(హైదరాబాద్)

* * *

29—9—72 శంకరలో చల్లా రాధాకృష్ణశర్మ గారు తమ వ్యాసంలో తెలుగుమాటల తీరుతెన్నులను చక్కని ఉదాహరణలతో వివరించి చెప్పారు. వారు అన్నట్లు ప్రతి భాషా సంస్కృతమునుండి శబ్దాలను గ్రహించింది. అటువంటి సంస్కృత భాష ఇప్పుడు మరుగున పడుతుండడం నిజంగా విచారించ దగ్గ విషయమే.

ఉపద్రష్ట కేశవస్వామి, (అమలాపురం)



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press: 6 & 7, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.



సుసాన్ అందమైన విగ్రహమే. మోడల్‌గా ఎన్నో అవకాశాలని కల్పించింది. ఇప్పుడీ అమ్మాయి టెలివిజన్ వ్యాపార చిత్రాలలో కూడా వేస్తున్నది. ఇక 'జీవితంలో స్థిరపడవచ్చు' అనుకుంటున్నది సుసాన్.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.